

అక్టోబరు 10 న శ్రీమతి దుర్గాబాయిగారి మేనకోడలు కుమారి లీల వివాహ సందర్భంలో భారతప్రధాని వధూవరులకు శుభాకాంక్షలు తెలుపుతున్న ఛాయాచిత్రం. ఇందులో వరుడు మాధవరావు బాజీ (హైదరాబాద్ ఇంజనీరింగ్ సర్వీస్) వధువులీల, భారత ప్రధానినెహ్రూ, శ్రీమతి దుర్గాబాయి, శ్రీమతి అమ్ముస్వామినాధన్, మొదలైనవా రున్నారు.



# విషయానుక్రమణిక

## 1951 అక్టోబరు 24





# ఆంధ్రపత్రిక

సంవత్సరచందా
రు. 12-0-0
విడిప్రతిక
4 అణాలు

ప్రతి బుధవారము
ప్రకటింపబడును

**Founder : K. NAGESWARA RAO**

సంపుటము 44
సంచిక 8
24-10-51

ఖర సంవత్సర ఆశ్వయుజ బహుళ నవమి బుధవారము


# ★ లియాఖత్ అలీఖాన్ హత్య ★

"ప్రవచనాన్ని విశ్వసించనివారు కంటబడితే వారి శిరస్సులు తెగ వెయ్యండి. ఒక్కరినీ మిగల్చకుండా విశ్వాస హీనులందరినీ తుదముట్టించండి"—ఖురాన్

ఈ యిరవయ్యో శతాబ్దంలో కూడా ఇటువంటి ఆదేశాన్ని శిరసావహించడం భగవదాజ్ఞ అని నమ్మేవారు ముస్లిందేశాలలో ఇంకా అనేకులున్నారు. పూర్వం పరదేశాల నాక్రమించడానికి ఈ నమ్మిక ఎలా ఆధారభూతమయిందో, ఈనాడురాజకీయ దాస్య విముక్తి పోరాటానికీ, పొరుగు రాజ్యాలతో కలహాలకీ ముస్లిందేశ నాయకులకు అలాగే ఆధారభూతమౌతోంది. అందువల్లనే రాజకీయ, సామాజిక పరిపాలనా సమస్యల గురించిన వాగ్వివాదాలలోనూ కలహాలలోనూ ముస్లిందేశాలలో హత్యలు సర్వసామాన్యమౌతున్నాయి. గత రెండుమూడు సంవత్సరాలలో ముస్లిందేశాలలో రాజకీయనాయకుల హత్యలు తరుచు సంభవిస్తున్నాయి. ఈజిప్టులో ఒక ప్రధానమంత్రి, మరొక మంత్రి హత్యపాలైనారు. సిరియాలో మూడుపర్యాయాలు తిరుగుబాటుసంభవించింది. ఒక ప్రధానమంత్రి, ఒక అధ్యక్షుడు, ఒక సైన్యాధిపతి హతులైనారు. పర్షియాలో ఒక ప్రధానమంత్రి హత్యకు గురైనాడు. జోర్డన్ రాజు అబ్దుల్లా కూడా హంతకుని పాలబడ్డాడు. ఇప్పుడు లియాఖత్ అలీఖాన్ కూడా ఆ నాయకుల అడుగుజాడలనే అనుసరించాడు.



లియాఖత్ అలీఖాన్

ముస్లిం దేశాలలో జరుగుతున్న ఈ హత్యల్ని గమనించినట్లయితే ఒక విషయం బోధపడుతుంది. అంధమతవిద్వేషాలకులొంగక, తమ దేశాల భవితవ్యం పాశ్చాత్యదేశాల సహాయసహకారాలపైనేఆధారపడిఉందనీ, సామాజిక వ్యవస్థను ఆధునిక వాతావరణానికి అనుకూలంగా సంస్కరించాలనీ విశ్వసించేనాయకులే హంతకుల వాత బడుతున్నారు. హంతకులు అంధ మత విశ్వాసాలకు, విద్వేషాలకు లొంగి, ఇస్లాం మత సంరక్షణకోసం హత్యలకు దిగుతున్నారు. ముస్లిం దేశాలన్నిటిలోనూ ఇట్టి మతోద్రేక పరుల సంఘాలు నానాటికిబలపడుతున్నాయి. పర్షియా రాజును హత్యచెయ్యడానికి ప్రయత్నించిన ఫదాయా ఇస్లాం సభ్యుడు, పాశ్చాత్యుల ప్రభావానికి లోబడిన రాజువల్ల ఇస్లాం మతం సంకరమౌతున్నదని ఆరోపించాడు.

పాకిస్తాన్ ప్రధాని లియాఖత్ అలీఖాన్ హత్యకు కారకుడు ఖాక్సార్ సంఘసభ్యుడని మొదట ప్రకటించారు తరవాత అఫ్ఘన్ జాతీయుడని ప్రకటించారు. ఈ సందర్భంలో ముస్లిం లీగ్ నాయకుల పట్ల ఖాక్సార్లు ఎప్పుడూ విరోధభావంతోనే ఉన్నారని జ్ఞప్తిలో ఉంచుకోవాలి. ఏడేళ్ళక్రిందట జిన్నాను

స్వగృహంలో (బొంబాయి) హత్య చెయ్యడానికి ప్రయత్నించిన వ్యక్తి ఖాక్సార్ సభ్యుడు. ఖాక్సార్లవలెనే సింధు రాష్ట్రంలో హుర్ జాతివారు కూడా ముస్లింలీగ్‌కు ప్రతికూలురు. ఖాక్సార్లు, హుర్ జాతివారు కూడా ఇస్లాం మతవ్యాప్తి తమ ధర్మమనీ, అందుకోసం క్రూర హత్యాకాండకు దిగవలసినా వెనుదియ్యకూడదనీ ఈనాటికీ విశ్వసిస్తారు

ముస్లింలీగ్ ఉద్యమాన్ని గమనిస్తే ఇట్టి ఉద్దేశం ఉన్నట్లు కనపడదు. కాని హిందువుల మూలంగా ఇస్లాం మతానికి ముప్పున్నదని నినాదంచేసి ఉద్యమం లేవదీసింది. తమ ఉద్యమాన్ని బలపరుచుకోడానికి ఖాక్సార్లు మొదలైనవారి మతోద్రేక స్వభావాన్ని తమకు బలంగా చేకూర్చుకోడానికి ముస్లింలీగ్ వెనుదియ్యలేదు. 1946 ఆగస్టులో ప్రత్యక్షచర్య పేరుతో ముస్లింలీగ్ రాజకీయోద్యమ స్వభావం పూర్తిగా తేటపడింది.

మతోద్రేకాన్ని రెచ్చగొట్టి, దానిని రాజకీయావసరాలకు ఆయుధంగా ప్రయోగించడం ముస్లింలీగ్ అలవర్చుకుంది. కాని ప్రయోగించినతరవాత తిరిగి దానిని అదుపులో పెట్టడం అసాధ్యం. ఈ సత్యం తెలిసికూడా, సంభవించగల దుష్ఫలితాలను లక్ష్యపెట్టక రాజకీయ లక్ష్యాల సాధనే ప్రధానంగా పరిగణించి ముస్లింలీగ్ ఉద్యమాన్ని నడిపింది. దీనికి ఫలితంగా దేశ విభజనకు కాంగ్రెస్ సమ్మతించింది. అయితే దేశవిభజన అనంతరం పంజాబ్ బెంగాల్ రాష్ట్రాలలో చెలరేగే ఘోర సంఘహత్యలను ముస్లింలీగ్ నివారించలేకపోయింది. తిరిగి 1949 లో రూపాయి మారకంగురించి పాకిస్తాన్ భారతదేశాల మధ్య తగవువచ్చి వ్యాపారం స్తంభించిపోయినప్పుడు, తూర్పు పాకిస్తాన్‌లో ఏర్పడిన దుర్భిక్షాన్ని నివారించలేక పాకిస్తాన్ నాయకులు ఉద్రేకపూరిత ప్రచారం సాగించి తిరిగి మతకలహాలను రెచ్చగొట్టారు. ఈ కలహాల ఫలితంగా ఉభయదేశాల మధ్యనూ యుద్ధం అనివార్యమౌతున్నదని తోచగానే పాకిస్తాన్ ప్రధాని లియాఖత్ ఆలీఖాన్ నెహ్రూ ఆహ్వానంపైన ఢిల్లీవచ్చి 1950 ఏప్రిల్‌లో ఒడంబడిక చేసుకుని కలహాలను నిలపగలిగాడు.

కాని మతకలహాలనేవి రాజకీయావసరాలకు ఎంత చక్కని సాధనగా ఉపయోగపడినా, అదుపులో ఉంచడంకూడా సులువని ఆశపడిన ముస్లింలీగ్ నాయకులకు క్రమంగా తమ నిస్సహాయత తెలిసివచ్చింది. కాశ్మీర్ సమస్య సందర్భంలో రెచ్చగొట్టిన ఉద్రేకాన్ని అదుపులోకి తేలేకపోతున్నారని స్పష్టపడుతూనేఉంది. తిరిగి కాశ్మీర్‌పై దాడి జరగగలదని తెలియగానే భారతప్రభుత్వంకూడా ఎదిరించడానికి సిద్ధపడ్డంతో, కాశ్మీర్ దాడిని పాకిస్తానీలు విరమించుకోక తప్పలేదు. అందువల్ల పాకిస్తాన్‌లో ఉద్రేకాలు మరింత ఉగ్రతంగా పెరిగిపోయాయి. ప్రజల మనఃస్థితికి అనుగుణంగా పాకిస్తాన్ ప్రభుత్వం అనుసరించక తప్పలేదు. ఉద్రేకపరుల తృప్తికోసం లియాఖత్ ఆలీఖాన్ పిడికిటి బిగించి అదే ఇకపైన తమ సంకేతమని చెప్పాడు.

వాస్తవానికి లియాఖత్ ఆలీఖాన్ పాకిస్తాన్‌లో ప్రజాస్వామ్య వ్యవస్థాపనకు అధికంగా కృషిచేశాడు. జిన్నా ప్రకృతితః నియంత. లియాఖత్ ప్రజాస్వామ్యవాది; సంస్కర్త. భారతదేశం పట్లనూ, కాంగ్రెస్ పట్లనూ జిన్నాకు ఉన్నంతద్వేషమూ అసహనమూ లియాఖత్‌కు లేవు. లియాఖత్ పాకిస్తాన్ ప్రజల కోసం ఎంత రాగద్వేషాలు ప్రదర్శించినా అంతరంగంలో భారతీయులకు మిత్రుడే. పాకిస్తాన్ ప్రత్యేకరాజ్యాన్ని స్థాపించినవాడు జిన్నా అయినప్పటికీ, సుస్థిరపరిచి రాజకీయ స్వరూపమిచ్చినవాడు లియాఖత్.

భారతదేశంతో కాని ఆఫ్ఘనిస్తాన్‌తో కాని యుద్ధానికి దిగినట్లయితే, అది ఆ దేశాలకే కాక పాకిస్తాన్‌కుకూడా వినాశకరం కాగలదని లియాఖత్ మనఃపూర్తిగా విశ్వసించాడు. పాకిస్తాన్‌లో రాజకీయావసరాల కోసం ఎంతగా యుద్ధ నినాదాలు చేసినప్పటికీ, భారతదేశంపైన పాకిస్తాన్ దాడి చెయ్యకపోవడానికి లియాఖత్ కారకుడని చెప్పాలి.

అయితే రెచ్చగొట్టిన ద్వేషాన్ని అదుపులో పెట్టడం లియాఖత్‌కు అసాధ్యమయింది. తమ దేశంలో అనర్థాలన్నిటికీ భారతీయులు కారకులని పాకిస్తాన్‌లో అనేకవర్గాలు అపోహ పడుతున్నారు. బెంగాలీ పంజాబ్ రాష్ట్రాలను విభజించడం జిన్నాకీ పాకిస్తానీలకూ మనోవ్యథకు కారణమయింది. 1947 లో జరిగిన దేశ విభజన తుదినిర్ణయం కాజాలదనీ, పాకిస్తాన్‌లో మరికొంత భూభాగం కలవాలనీ కోరేవారు పాకిస్తాన్‌లో లేకపోలేదు. భారతదేశంలో యుద్ధం అనివార్యమని భావించేవారు పాకిస్తాన్‌లో అనేకులున్నారు. వీరందరికీ లియాఖత్ పరిపాలనా విధానం తృప్తికలిగించలేదు. దేశంలో రెచ్చగొట్టిన విద్వేషాగ్నికి ఉత్తమ రాజనీతిజ్ఞుడైన లియాఖత్ ఆహుతైనాడు. లియాఖత్ మృతితో యుద్ధోన్మాదుల్ని అరికట్టగల బలం పాకిస్తాన్ నాయకులకు క్షీణించిందని చెప్పాలి. అయితే రాజకీయ పరిపాలనా విధానాలలోనూ, భారతదేశంతో వ్యవహారాలలోనూ లియాఖత్ విధానాన్నే అనుసరించే గులాం మహమ్మద్ గవర్నర్ జనరల్‌గా నియమించబడ్డంవల్ల, ఉభయదేశాలమధ్యనూ సంఘర్షణ పెచ్చుమీరదని భావించవచ్చును.



గత బుధవారంనాడు జరిగిన కాంగ్రెస్ విషయ నిర్ణయసభలో శ్రీయుతులు సంజీవరెడ్డి, తిరుమలరావు, పట్టాభిసీతారామయ్య, బాపినీడు, చంద్రమౌళి గార్లు.

# కాశ్మీర్ : డా॥ గ్రాహాం నివేదిక

కాశ్మీర్‌లో సైనికోపసంహరణ నిమిత్తం భారత పాకిస్తాన్ ప్రభుత్వాలమధ్య ఒప్పందం సాధించడానికి భద్రతామండలి నియమించిన ప్రతినిధి డా॥ ఫ్రాంక్ గ్రాహాం తన నివేదికను మండలికి సమర్పించాడు.

ఉభయప్రభుత్వాల మధ్యనూ సంప్రదింపులు జరిపి ఏయే అంశాలపైన సమాధానం కుదరలేదో డా॥ గ్రాహాం తన నివేదికలో తెలిపాడు. భద్రతామండలి గ్రాహాంను నియమించినప్పుడు సమాధానం కుదరని అంశాలను తెలియపరచాలని ఆదేశిస్తూ, ఆ అంశాలను ఒక పరిష్కర్తవల్ల పరిష్కరించే ఉద్దేశాన్ని ప్రకటించింది. అయితే గ్రాహాం ఆ అంశాలను నివేదికలో పొందుపరుస్తూ, ఉభయప్రభుత్వాల మధ్యనూ సమాధానం కుదిరే అవకాశం ఉందనీ అరువారాల వ్యవధినిచ్చి మధ్యవర్తిత్వ రాయబారాలను నడిపించాలనీ సూచించాడు.

సమాధానం కుదరని అంశాలపైన ఇంకా ఒక మధ్యవర్తి సహాయంతో రాయబారాలు కొనసాగడం అవసరమని డా॥ గ్రాహాం చేసిన సూచన, ఇన్నాళ్లుగా భద్రతా మండలి తిరస్కరిస్తున్న భారత ప్రభుత్వ వాదాన్నే సమర్థిస్తున్నది. ఈ సమస్యల్ని సమాలోచనల ద్వారా పరిష్కరించవలసిందే కాని పరిష్కర్త తీర్పు ఎన్నటికీ సమ్మతం కాజాలదని భారత ప్రభుత్వం వాదిస్తున్నది. పరిష్కర్త నియామకానికి భద్రతామండలి అవకాశమిస్తున్నంతకాలమూ, పాకిస్తాన్ సామరస్య ధోరణిలో రాయబారాలు జరపదని భారత ప్రభుత్వానికి తెలుసును. ఈ విషయాన్ని ఇంతవరకూ భద్రతామండలి గ్రహించలేకపోయింది. సఖ్యతవల్ల సాధించుకోవలసిన దానికంటె అన్యుల ప్రమేయం తెచ్చి వారి అండవల్ల అధిక ప్రయోజనం సాధించాలని చూస్తున్న పాకిస్తాన్ పరిష్కర్త నియామకం కోసం తహతహలాడుతోంది.



కాశ్మీర్ మధ్యవర్తి
డా॥ ఫ్రాంక్ గ్రాహాం

దేశవిభజన సమయంలో పరాయి ప్రభుత్వంవల్ల సరిహద్దు రాష్ట్రంలో ఎట్టి అక్రమం జరిగినదీ భారతీయులు మరిచిపోలేరు. అదేవిధంగా అక్రమంగా కాశ్మీర్‌నుకూడా సాధించే ఉద్దేశంతో పాకిస్తాన్ కాశ్మీర్‌లో సైనికోపసంహరణ విధానాన్ని భద్రతామండలి పరిష్కర్తకూ, ప్లెబిసైట్ (జనవాక్య నిర్ధారణ)ను కాశ్మీర్ పరిపాలననూ జనరల్ నిమిట్జ్‌కూ కట్టబెట్టాలని ప్రయత్నిస్తోంది. ఇట్టి ప్రయత్నంలో బ్రిటన్ అమెరికాలు పాకిస్తాన్‌కు తోడ్పడుతున్నాయి. కాని ఈ కుట్రలకు భారతప్రభుత్వం లొంగబోదని స్పష్టపరిచింది. ప్లెబిసైట్ సమయంలో షేక్ అబ్దుల్లా ప్రభుత్వాన్ని తొలగించడం జరగబోదని తెలియచేసింది.

మధ్యవర్తిగా తను కృషి చేసినన్ని



## ఎన్నికలలో వివిధ పార్టీల చిహ్నాలు:

ఆయా అఖిలభారత రాజకీయ పార్టీలు సూచించిన 14 చిహ్నాలలో యింట ప్రచురించిన యీ ఎనిమిది చిహ్నాలను ఎన్నికల కమీషన్ ఆమోదించింది.

ఎడమనుంచి కుడికి మొదటి వరస నాలుగు చిహ్నాలు:

(1) కాడికి కట్టిన రెండెడ్లు – కాంగ్రెసు పార్టీ. (2) చెట్టు – సోషలిస్టు పార్టీ. (3) ఐదువేళ్లుగల హస్తము – ఫార్వర్డ్ బ్లాక్ (రూయికర్) పార్టీ (4) గుడిసె – కిసాన్ మజ్దూర్ పార్టీ.

రెండవ వరస నాలుగు చిహ్నాలు:

(5) ధాన్యపుకంకి కొడవలి – కమ్యూనిస్టు పార్టీ. (6) పార, నేలపార – విప్లవ సోషలిస్టు పార్టీ.

(7) ధాన్యం తూర్పార పట్టుతున్న మనిషి – కృషి కార్ లోం పార్టీ. (8) ప్రమిద దీపం – జనసంఘం.

రోజులూ భారత పాకిస్తాన్‌ల మధ్య తీవ్ర ఉద్రేకాలు, యుద్ధ వాతావరణం నెలకొనడంవల్ల తన రాయబారం విఫలమయిందనీ, పరిస్థితులు కొంత ప్రశాంతపడితే రాయబారాలు ఫలించగల అవకాశం ఉన్నదనీ డా॥ గ్రాహం తెలిపాడు.

సైనికోప సంహారణ విషయమై ఉభయ ప్రభుత్వాలకూ మధ్య ఒప్పందం కుదరక పోవడానికి భద్రతామండలి తీర్మానాలు రెండింటిలోనూ ముఖ్యాంశాలనుగురించి పూర్వకాశ్మీర్ కమిషన్ రెండు ప్రభుత్వాలకూ రెండువిధాల అర్థాలు చెప్పడమే నని డా॥ గ్రాహం నివేదించాడు. భద్రతా మండలి తీర్మానాలలో కొన్ని అంశాలను స్పష్టపరచవలసిందని భారత ప్రభుత్వం కోరినప్పుడు ఆనాటి కాశ్మీర్ కమిషన్ తన అభిప్రాయాలను ప్రత్యేక లేఖల ద్వారా తెలియపరిచింది. ఆలేఖలు ఆధారంగానే భారత ప్రభుత్వం భద్రతామండలి తీర్మానాలను అమలు జరపడానికి ఆమోదించింది. అయితే ఇవే అంశాల పైన పాకిస్తాన్ ప్రభుత్వం కోరినప్పుడు కాశ్మీర్ కమిషన్ భిన్నమైన అభిప్రాయాలను వ్యక్తపరుస్తూ పాకిస్తాన్ ప్రభుత్వానికి లేఖలు వ్రాసింది. ఈభిన్న అభిప్రాయ ప్రకటనలవల్లనేఇప్పుడు సైనికోపసంహారణ గురించి రెండు ప్రభుత్వాల మధ్యనూ ఒప్పందం కుదరలేదు. భద్రతా మండలి ఈ విషయాన్ని చర్చించి, ఈ అంశాలపైన కూడా ఉభయ ప్రభుత్వాలూ సమాలోచనలు జరిపి రాజీకుదుర్చుకోవాలని ఆదేశించినప్పుడు గాని సైనికోపసంహారణ సమస్య శాంతియుతంగా పరిష్కారం కాగల అవకాశం ఉండదు.

తరువాత డా॥ గ్రాహం ఉభయప్రభుత్వాల మధ్యనూ సామరస్యం ప్రపంచ శాంతికి ఎంత అగత్యమో వివరించి, సైనికోపసంహారణ నిమిత్తం ఉభయ ప్రభుత్వాలకూ తాను సూచించిన ఒక పథకాన్ని వివరించాడు. దీనిని ఉభయ ప్రభుత్వాలూ పరిశీలించి ఇచ్చిన సమాధానాలను బట్టి ఏయే అంశాలలో ఒప్పందం కుదరవలసి ఉన్నదీ వివరించాడు. ఈ సందర్భంలో భారత ప్రభుత్వం కాశ్మీర్‌లోని తన సైన్యాలను చాలవరకూ తరలించి వేయడానికి సంసిద్ధంగా ఉన్నట్లు తెలియపరచబడింది. పాకిస్తాన్ సైన్యాలనూభారత సైన్యాలనూ ఒకేసారి తరలించడానికి కూడా భారతప్రభుత్వం సమ్మతించింది.

అయితే అభిప్రాయ భేదాలు ముఖ్యాంశాలన్నిటిపైనా ఉన్నాయని కూడా గ్రాహం నివేదిక తెలుపుతున్నది. సైనికోప సంహారణకు ఎంతకాలం ఇవ్వాలి, ఏ పక్క ఎంతెంత బలాన్ని మిగల్చాలి, స్థానిక బలాలను ఎంతవరకూ నిరాయుధం



ఒరిస్సా హైకోర్టు ప్రధాన న్యాయమూర్తిగా నియమింపబడిన బచ్చు జగన్నాథ దాసుగారు

చెయ్యాలి. అనే అంశాలపైన సమాధానం కుదరలేదని డా॥ గ్రాహం నివేదించారు.

దీనిపైన ఒప్పందం కుదర్చాలంటే, భద్రతా మండలి కార్యాలయంలోనే ఉభయప్రభుత్వాల ప్రతినిధులతోనూ మధ్యవర్తి సమాలోచనలు జరపాలనీ, ఆరు వారాలలో ఈసమాలోచనలు ముగియాలనీ భద్రతామండలి ఆజ్ఞ ఇవ్వాలని డా॥ గ్రాహం సూచించాడు. ఉభయదేశాలలోనూ జరుగుతున్న విద్వేష ప్రచారాన్ని

(48-వ పేజీ చూడండి)



స్వతంత్ర భారతదేశంలో జరగనున్న తొలిఎన్నికలలో వోటింగురహస్యంగా జరపడంకోసం ఏర్పాటయిన బాలట్ పెట్టెలు.

# వడ్లగింజలో బియ్యపుగింజ

మీకు పెళ్ళయిందా అన్నాడు. అదో ప్రశ్న గాకాదు. బాతాఖానీలో యిదో అంశం. అది అతన్ని ఎగతాళి చేశాడనుకుంటే యేంలాభం! "ఆ! నాకు ఓ మామగారంటూ యేర్పడ్డాడు. ఒకళ్ళు యేడుస్తుంటే యింకొకళ్ళు నవ్వటం సహజమేగా అన్నాడు గోపాలరావు చటుక్కున. నవ్వుతున్న యిద్దరు గభాలున ఆపేశారు. గోపాలరావు ఎందుకట్లా అన్నాడో వీళ్ళకు తెలియదు. గోపాలరావు వీళ్ళిద్దరి వైపుకు తీక్షణంగా చూశాడు. వీళ్ళిద్దరు గోపాలరావు వైపుకు ఆశ్చర్యంగా చూశారు.

'సిగ్గుండాలి మానవజన్మ యెత్తిన తర్వాత, పిల్లని కనంగానే సరికాదు' అంటూ కనుబొమ్మలు రెండూ ముడేశాడు గోపాలరావు.

ఆ యిద్దరు కాలక్షేపానికి కదిలించిన వాళ్ళు కాబట్టి, గోపాలరావు ధోరణి చూస్తే, వాళ్లకు కోపంకంటె నవ్వెక్కువ వచ్చింది. నిమిషంలో యిద్దరు పళ్లికిలించారు.

సిగ్గులేకపోయిన తర్వాత యెందుకండి జన్మ యెత్తిన తర్వాత అని తాళంవేశాడు అందులో వకతను.

జామాతా దశమగ్రహః అన్నారు. కాని ఇప్పుడు తారుమారయింది అన్నాడు గోపాలరావు వాళ్ల మాట వినిపించుకోకండానే.

'తారుమారేమిటి తల్లక్రిందులైందంటే నమ్మండి' అన్నాడు యింకొకతను.

'నే నెప్పుడైనా పంపించ నన్నానా, పెద్ద అల్లుడు అట్లాగే చేశాడు మొదట్లో, సంసారం నెత్తిన పడంగానే తెలిసిం దనటానికి. బుద్ధి వుండక్కర్లా. ఈ రోజుల్లో మంచికి మంచిలేదండి' అన్నాడు గోపాలరావు వూడిన పిలక ముడి వేసుకుంటూ.

న్యాయానికి కూడు లేదండి. వుంగరాల్ల చేత్తో మొట్టేవాళ్లదే రాజ్యం అన్నాడు అందులో వకతను.

మెత్తని వాళ్లను చూస్తే మొత్తబుద్ధవుతుందని... అదిగాదండి మీరు చెప్పండి. నేను మేనల్లుని కాదనుకోండి, అల్లుడైన తర్వాత, పెద్ద అల్లునికి నాకు భేదం చూపిస్తే! నేనే నేమిటి గాజులు తొడుక్కుని కూర్చుంది అంటూ గోపాలరావు రంగంలోకి దిగాడు.

'ఆపని ఆడవాళ్ళు చేస్తారు మీకెందుకు అంటూ ఒకాయన కొంచెం ధూపం వేశాడు.

'సామెతకు చెపుతున్నానండి, నాకు బంధుప్రేమ అంటే మొదటినుంచి అదో పిచ్చి, మనవాళ్లయ్యారుగదా అని పిలిచినా, పిలవకపోయినా మామగారింటికి వెళ్ళిన మాట వాస్తవమే' అంటూ లేచి నుంచున్నాడు గోపాలరావు.

'చెప్పరే—అట్లా చెప్పరే. పిలవందే మామగారింటికి వెళ్ళితే యేం గౌరవం యేడుస్తుంది అంట! అంటూ అగ్నిలో ఆజ్యం పోశాడు రెండో ఆయన.

నేను ఆ మాటే అనుకున్నా. బుద్ధి గడ్డి తిన్నది. నేను వెళ్ళటం వచ్చింది యింతకీ అన్నాడు తన మామూలు ధోరణిలో.

వెళ్ళంగానే వాళ్ళకు ఓ విధమైన అలుసు యేర్పడింది. అంటూ యింకో ఆయన తాళం వేశాడు.

ఇప్పు డనుకుంటే యేంలాభం. వెళ్ళినందుకు తగిన ప్రాయశ్చిత్తము చెయ్యనే చేశాడు అంటూ వుపోద్ఘాతము ప్రారంభించాడు గోపాలరావు.

'అదేమిటండోయ్ ప్రాయశ్చిత్తము అంటున్నారు?'

'ఎందుకయ్యా దాగిస్తారు. అవాలసిన పని అంతా అయింది'

'అనుకున్నంతా అయిందీ?'

'నేను అనుకున్నానుటయ్యా. ఎంత పిలవందే వెళ్ళితేమాత్రం నెలలా, సంవత్సరాలా వాళ్ళింట్లో ఉన్నది? వాళ్ళతిండికి ఆశపడి వెళ్లానా? దాని దుంపతెగ రెండో రోజే వెళ్ళకొట్టాలి? మీరు చెప్పండి' అంటూ సమాధానంకోసం నోరు తెరిచి చూస్తున్నాడు గోపాలరావు.

'వెళ్ళి పొమ్మన్నాట్టయ్యా! ఎంత చెడ్డా అల్లుడేను,' అని వకతను అల్లుణ్ణి వెళ్ళిపొమ్మన్నారా' అంటూ యింకో ఆయన,

'రెండోరోజేట' అని మరొకాయన, యథాశక్తి రెచ్చగొట్టారు.

'మెల్లిగా అంటారేమిటండీ, ఫ్యాన్‌తో చెప్పి గెంటిస్తే' అంటూ వుద్రేకం వెళ్ళగక్కాడు గోపాలరావు.

'గెంటించటమే? ఎంత పొగరుమోతు మామగారు దొరికాడయ్యా!' అంటూ వకాయన శృతి పట్టాడు.

అందుకనేగా యిప్పుడు నాకు ఆయనకు తగాదా. లేకపోతే యేముంది? ఇస్తానన్న పళ్లెం యిస్తానన్లేదని అబద్ధం.

'ఆడితే అడిగానా? వాకిట్లోకి వెళ్ళితే జరీ బట్టలు పెట్టలేదని సణిగానా? మనకు భగవంతుడివ్వాలి కాని, వకళ్ళు యిచ్చేదేమిటంట?' అన్నాడు ప్రశ్నార్థకంగా గోపాలరావు.

'మనకు కలిసి రావాలి కాని యింకొకళ్ళు పెట్టితే యెన్నాళ్ళు అనుభవిస్తాం,"

'మా బాగా అన్నారు. నేనూ అదే అనుకున్నా. నాకు యెందుకు కోపంరావటంలేదు గాని, ఆ కుట్రబుద్ధి, ఆ కుట్రమాటలు యెందుకని? పెద్ద అల్లుడుదగ్గర యిట్లా చేస్తేనా, మూడోనాటికి తచ్చ కక్కక పోయాడూ?'

'మనిషిని పట్టే చేస్తారు. పెద్ద అల్లుని దగ్గర యిట్లా యెట్లా చేస్తారు? నక్కాలు విరగవూ.'

'అవునండి అక్షరాలా నిజంపల్కారు. మీరు చెప్పండి. ఎక్కడైనా అల్లుడు చెప్పినట్టు మామగారు నడుచుకోవాలి గాని, మామగారు అల్లుణ్ణి అథారిటీ చెయ్యగా చూశారా?'

'మీరు చెపుతున్నారుగా?'

'నేను సరేనండి, యింకెవ్వరైనా వున్నారా అని.'

'ఎవ్వరుంటారండి యీ కాలంలో అణిగి?' మీరు కాబట్టి యిట్లా వూరుకున్నారు కాని, నాబోటా డవుతేనా? మూడు నిమిషాల్లో ముప్పతిప్పలు పెట్టి

లక్ష్మీనరసింహశాస్త్రి

మూడు చెరువులు నీరు త్రాగించేవాణ్ణి,' అంటూ మీసంమీద చెయ్యి వేశాడు అందులో వకాయన.

'అట్లా చెయ్యబట్టే పెద్దల్లుని దగ్గర చెప్పు క్రింద తేలులాగ అణిగి వచ్చినట్టు పడివున్నాడు. ఈ వేషాలన్నీ నా దగ్గరే వెంకటాయి వేషాలనీ! మా స్వానుగా ఎన్నాళ్ళు సాగుతాయో!' అన్నాడు తన కేదో ధైర్యం వచ్చినట్టు.

'సాగినన్నాళ్ళు సాగుతాయి!

'ఇంకా సాగనిచ్చేది వట్టిమాట లెండి.'

'అలుసు కనిపెట్టాడు, యింకా వ్యారం చేస్తారంట?'

'నేనా, ఏదైనా చేస్తా, మూషడుకుసు చెయ్యాలా? రైల్లో పెళ్ళాన్ని వక్కత్తిని పంపించేస్తా రోగం కుదురుతుంది.'

'ఎవరిదంట?'

'నేను అదే అనస్తున్నా. లేనిపోయింది అదిమాత్రం చెయ్యకండి. తీరా ఎక్కడైనా దారి తప్పిందంటే మీ కంఠానికి వస్తుంది.'

'నిజమేనండి మీరు చెప్పింది. అయనెట్లా పంపించాడంట! లేకపోతే యింకో కపని చేద్దామనుకుంటున్నా. అసలు దాన్ని పుట్టింటింటికి పంపించనే పంపించను.'

'మీరూ వెళ్ళరా?'

'పెళ్ళాన్ని పంపించకండా నేను వెళ్ళి అఘోరిస్తానుటండీ, మీరు ఎగతాళ్ళోకి దిగారూ?'

'ఊరుకోరా, యేమిటది పెద్దమనిషితో పని. ఒకే వుపాయంఅండి,' అన్నాడు అందులో వకాయన నోట్లో చుట్ట పైకి తీస్తూ.

'ఏడిసినట్టే వుంది వుపాయము, కూతుర్ని చూడాలని వుంటే వాళ్ళే వచ్చి చూస్తారు వకసారి. ఈ కరువు రోజుల్లో మీరు పంపించక పోవటమే వాళ్ళకు నయము,' అన్నాడు యింకోకాయన రెండు చిటికలు పొడుము పీలుస్తూ.

'నాకు అట్లాగే తోస్తోందండి. చావు వచ్చి పడింది. ఎట్లా వేగను యీ మామ గారితో అంట! అసలు పుట్టింటికే పంపించేద్దామని వుంది. అట్లా అవుతే?' అన్నాడు గోపాలరావు గుడ్లు మిటకరించి.

'అట్లా పంపిస్తే మీకేం లాభంఅంట, ఇక్కడ చేతులు కాల్చుకోవటం తప్ప. తీగకు కాయబరువా? కన్న కూతుర్ని యింట్లోనే వుంచుకుంటాడు యెన్నాళ్ళైతేం? ఏదో వోనాడు మీరే వెళ్ళి తెచ్చుకోవాల్సి వస్తుంది,' అన్నాడు ఓ సంసారి.

'అవునండి మీరన్న మాట నిజమే. రెండోకూతుర్ని ఆరునెలలనుంచి యింట్లో పెట్టుకోలా? అయినా ఓసారి అననే అన్నాడు, పెళ్ళాన్ని తీసుకువెళ్తానంటె, మళ్ళీ తీసుకొచ్చేవాళ్ళు లేరు నువ్వే మళ్ళీ తీసుకురావాలని,' అన్నాడు బిక్కమొహం వేస్తూ గోపాలరావు.

'ఇదెక్కడైనా వుందండి, ఎక్కడైనా అల్లుడు ఫలానా రోజుకు తీసుకురమ్మని, తీసుకు వెళ్ళమని, మేము విన్నాంగాని, మామ గారు యిట్లా చెప్పటం, మా కెక్కడ తగలేదండి,' అంటూ వకాయన ముక్కుమీద వేలువేశాడు.

'అందుకనే గాదండి యిందాకటినుంచి మొత్తుకునేది? యీయనతో యెట్లా గా వేగటంఅంట. ఎటూచ్చినా తంటాగావుందే.

ఈ పెళ్ళి చేసుకోకండా వున్నా బాగుండేది అనిపిస్తోంది, అన్నాడు గోపాలరావు చివరకు విసుగుపుట్టి.

'చేసుకున్నారుగా' అంటూ వకాయన నగ్నసత్యాన్ని బయటపెట్టినట్లు, తల కొంచెం క్రిందకుదించి, కళ్ళజోడులోంచి తన దృష్టులు గోపాలరావు కళ్ళల్లోకి పోనిచ్చాడు.

'అందుకనేగా యీ అవస్థ? ఏదైనా మీరు చెప్పండి వుపాయం,' అంటూ ప్రక్క పెద్దమనిషివంక ఆశగా చూశాడు గోపాలరావు.

అవతల బెంచీమీదనుంచి, ఒకాయన, 'అసలు పోట్లాట యెందుకొచ్చిందండీ?' అంటూ జనాన్ని తోసుకుంటూ, గోగ్రహణంలో ఉత్తరుడులాగ మహా తీక్షణంగా వచ్చాడు గోపాలరావు దగ్గరకు.

'రెడ్డొచ్చె మొదలాడు అన్నట్లుంది', అన్నాడు వకాయన. ఇందాకటినుంచి చెప్పిన రామాయణం యేమిటి, మళ్ళీ సీత, రామునికి యేమవుతుందని అడగటం యేమిటి' అని రెండో ఆయన.

అందులో ఓ పెద్దమనిషి, 'అదికాదండీ, యిన్ని చెప్పారు. అసలు పోట్లాట యెక్కడ ప్రారంభమయిందో చెప్పితే... అంటూ నీళ్ళు నమిలాడు.

'అట్లా అడగండి. నాది తప్పవుతే చెప్పు తీసుకొని కొట్టండి...' అంటూ వుద్రేకంగా ప్రారంభించాడు మళ్ళీ గోపాలరావు.

'అంత అవమానమా, బూట్సు తొడుక్కున్నాయనని పట్టుకుని...' అంటూ వకాయన చమత్కరించాడు.

'నేను కోపంలో అన్నానులెండి. మీరేమీ అనుకోకండి' అన్నాడు గోపాలరావు చటుక్కున

'పెళ్ళికి పిలవలేదనికూడ నేను ఎక్కువ అనుకోవటంలా. ఇంట్లోకొచ్చిన వాణ్ణి ఎందుకు వెళ్లమనాలని. నాకది పట్టుదల. ఎంత హడావడిలో వుంటేమాత్రం...'

'హడావు డేమిటి !'

'ఏదో టెలిగ్రాం వచ్చింది. దాని గొడవలో వున్నాడు. పాపం గాభరాలో వున్నమాటనిజమే'

'చెప్పరేం ఆమాట? టెలిగ్రాంవచ్చి పాపం ఆయన హడావడిలోవుంటే... మీరేమన్నారు'

'నేనేమంటాను? మీరు యివ్వాళ సాయంత్రమే వెళ్ళుతారు గామాలు. నాకు పనివుంది. రేపు వుదయాన నేనూ వెళ్లాలి అన్నాను. అంతే'

'అప్పుడు వారేమన్నారు?'

'నేను అర్జంటుగా యీపూటే వెళ్లాలి అంటూ వెళ్ళుతూ ఓ ప్యూనును పిలిచి మా అల్లుడు రేపు ప్రొద్దున్నే వెళతాడు. పుడయానే కారెక్కించు. కారుమాత్రం తప్పనీక అన్నాడు. మళ్లీ ఆనాడు కూడవుండి పోతానసేకదా అంటు,'

(48-వ పేజీ చూడండి)

పెద్దకథ

# జీవితరేఖ

"ప్రేమ"

(గత సంచికతరువాయి)

మర్నాడు పొద్దున ఆమెని 'లేడీస్ వెయిటింగ్ రూము"లో కూచో పెట్టి అతనుటికెట్ తీసుకురావటానికి వెళ్ళాడు. ఆ రాత్రి నించీ అప్పటిదాకా మళ్ళీవాళ్ళిద్దరూ మాట్లాడుకోనే లేదు. అసలా రాత్రి ఇద్దరికీ నిద్రపట్టనేలేదు. ఏవో ఆలోచనలతో గడిపేశారు. తెల్లవారి లేవగానే ఆమెగుడ్డలన్నీ సద్దుకుని ఓ ఇస్త్రీ చీరకట్టుకుని ప్రయాణానికి సిద్ధపడింది. అతనూ అది గమనించి మెదలకుండా ఓ'జట్' తీసుకువచ్చాడు. బండీలోకూడా ఎడమొగం పెడమొగం పెట్టుకుని అతను బజారు వంకా, ఆమె జట్కాలో ఉన్న అద్దంలో తన ప్రతిబింబమూ చూస్తూ కూచున్నారు.

గోపాలం టికెట్ తీసుకున్నాడు. కొంతసేపు, ప్లాట్‌ఫారంమీద అటూ ఇటూ పచార్లు చేసి చివరికి 'హిగ్గిన్ బాదమ్స్'లో పుస్తకాలు చూస్తున్నాడు.

మరికొంతసేటికి రైలు వచ్చింది. అతను ఆదరాబాదరాగా ఆమెని ఓ కంపార్టుమెంటులోకి ఎక్కించి "టికెట్ ఇదిగో" అన్నాడు ముభావంగా. ఆమె మెదలకుండా చెయిచాచి తీసుకుని కిటికీ అద్దాలలో నించి బయటికి చూస్తోంది.

అతను మళ్ళీ ప్లాటుఫారంమీద పచార్లు చేయటం ప్రారంభించాడు. రైలుకదులుతుండగా ఆ కంపార్టుమెంటు దగ్గరకెళ్ళి "చేరగానే ఉత్తరంరాయి" అన్నాడు రాయక పోయినా ఏమీ పరవాలేదన్నట్టు. ఆమె ఏమీ మాట్లాడలేదు. రైలు కదిలి వెళ్ళిపోయింది.

గోపాలం మెల్లగా కాలినడకన ఇంటి దోవ పట్టాడు. దోవలో అతని కనేక ఆలోచనలు కలిగాయి. రాధ పుట్టింటికి పోవటం అతని కొక విధంగా ఆనందాన్నే కలుగజేసింది. కాని ఆ ఆనందంలో కూడా ఏదో కొంత వెలితి కనపడుతూనే ఉందతనికి.

మధ్యలో ఓ కాఫీహోటల్లోకి వెళ్ళి ఇడ్లీకి ఆర్డరిచ్చాడతను. ఇకమీదట తను ఎంత ఖర్చుచేసినా అడిగేవాళ్ళెవరూ లేరనుకోవటంలో అతని మనసుకి ఎంతో తృప్తిగా ఉంది. కాఫీకూడా తాగి పది గంటలకి ఇంటికి చేరాడు.

ఇంటికొచ్చిన దగ్గిరనుంచీ అతని కేమీ తోచటం లేదు. కాసేపు ఏదైనా నవల చదువుదామని తీశాడు కానీ రెండుపేజీలు కూడా చదవకముందే విసుగుపుట్టి దాన్ని పక్కనున్న బల్లమీదికి విసిరికొట్టాడు.

రాత్రల్లా నిద్రలేకపోవటంవల్ల కళ్ళు జ్యోతుల్లా వెలుగుతున్నాయి. ఒళ్ళు ఎంతో బద్ధకంగా ఉంది. కాసేపు ఓ చిన్న కునుకు తీద్దామని కళ్ళుమూసుకు ప్రయత్నించినా ఏవో ఆలోచనలతో నిద్రపట్టనేలేదు. గోపాలం అలా పడుకోని ఉండగా ఇంతలో ఎవరో తలుపుతట్టారు.

"ఎవరూ?" అన్నాడు గోపాలం బద్ధకంగా.

"నేనేలే. తలుపుతియ్యి." బయటి నుంచి సమాధానం వచ్చింది. గోపాలం లేచి వెళ్ళి తలుపుతీస్తూ అన్నాడు—

"రారా. రామ్మూర్తీ. ఈమధ్య కనపట్టం లేదేం?" రామమూర్తి లోపలికి ప్రవేశిస్తూ—

"ఈమధ్య ఓ చిన్న ప్రయాణం తగిలిందిలే" అని,

"అవునుగాని పదిగంటలదాకా నిద్రేమిట్రా. అదేమిట్రా. అదేమిటి కళ్ళలా ఉన్నాయేం? రాత్రి నాటకానిగ్గాని వెళ్ళలేదు కదా." అన్నాడు.

గోపాలం నవ్వుతూ, "లేదులే రాత్రి సరిగా నిద్రపట్టలేదు." అన్నాడు.

రామమూర్తి గదంతా పరికిస్తూ టేబిల్ మీద ఉన్న నవలని చూసి దాన్ని చేతులోకి తీసుకుంటూ—

"కారణం. నవల పట్టేశావా ఏమిటి? అంత 'ఇంటరస్టింగ్'గా ఉందా ఏమిట్రా ఈ నవల. నాకూడా ఓసారివ్వు బాబూ చదివి మళ్ళీ ఇస్తాను. ఆదివారంకదూ ఏమీ తోచకుండా ఉంది. అందుకే కాసేపు కాలక్షేపం చేసొద్దామని ఇలా బైలుదేరి వచ్చాను." అన్నాడు.

గోపాలం వినలేక విసుగ్గా అన్నాడు—

"అబ్బబ్బ. అది కాదురా కారణం. అవతలవాణ్ణి నోరెత్తనీయకండా గుక్కతిప్పుకోకుండా మాట్లాడేస్తావేమిట్రా."

రామమూర్తి నవ్వుతూ, "లేకపోతే మరింకేమిటి కారణం?" అని కాస్త గట్టిగా "ఏమమ్మా రాధా. మీ ఆయన్ని బొత్తిగా నిద్రపోనియ్యటం లేదేమిటి రాత్రిళ్ళు?" అన్నాడు.

గోపాలం మొఖం ముడుచుకుని "అదింట్లో లేదు."

"ఏం? ఎక్కడికెళ్లిం దేమిటి? పెత్తనాలకా?"

"కాదు. పుట్టింటికి."

రామమూర్తి కొంత ఆశ్చర్యంగా "పుట్టిం

టికా!" అని, "ఈ ఆడవాళ్ళకి పుట్టిల్లు ఓ పెద్ద న్యూసెన్సు అయిపోయిందోయ్. చంపేస్తున్నారు మన్ని" అన్నాడు.

"ఏం? అలా అంటున్నావ్?"

"అబ్బే. ఏమీ లేదులే. కానీ, ఏదో కారణం చెబుతున్నట్టున్నావ్."

గోపాలం జరిగిందంతా సవిస్తరంగా చెప్పాడు.

రామమూర్తి అంతా విని నవ్వుతూ, "అదా సంగతీ" అన్నాడు.



గోపాలం ముసిముసిగా నవ్వాడు.

"కానీ నువ్వు చేసింది తప్పు పనేరా."

"ఏం? ఎంచేత?"

"అన్యాయంగా భార్యని పుట్టింటికి తరమటం తప్పు పని కాదూ?"

"అనుభవించనీ. నాలుగు రోజులా పుట్టింట్లో పడుంటే తెలిసొస్తుందులే." గోపాలం కోపంగా అన్నాడు.

రామమూర్తి నవ్వుతూ, "ఎవరికి తెలిసొచ్చేది? నీకా, ఆమెకా?" అన్నాడు.

గోపాలం మొహం గంభీరంగా పెట్టి, "నాకేం? హోటల్లో తింటాను" అన్నాడు.

"ఆవిడ మటుకు, నువ్వు హోటల్లో తింటే ఆవిడ ఇంట్లోనే తింటుంది."

"అహ ఎంతైనా మొగవాడు ఇంట్లో లేకపోవటం..."

"వాళ్ళ నాన్న లేడూ?"

గోపాలం నసుగుతూ అన్నాడు -

"మొగుడనే వాడు దగ్గిర లేకపోతే..."

రామమూర్తి మధ్యలో అందుకుని -

"నీకు మాత్రం ఆవిడ లేకపోతే ఏం తోస్తుంది చెప్పు" అన్నాడు.

గోపాలం ఇక మాట్లాడలేదు.

అతనేమీ మాట్లాడకపోవటం గమనించి రామమూర్తే అన్నాడు -

"నీళ్ళలో నిటారుగా ఉన్న పుల్ల పెట్టినా, అది అడుగుభాగంలో వంకర తిరిగినట్టు మనకి కనిపిస్తుంది కదూ. అలాగే మన ముందు జీవితంలోకి తొంగిచూస్తే జవితరేఖ వంకరలు తిరిగి ఉన్నట్టు కనిపిస్తుంది తెలుసా. నీళ్ళలో పెట్టిన పుల్ల వంకరగా ఏవిధంగా లేదో అలాగే సరిగా జీవించడం నేర్చుకున్నవాడి జీవితరేఖ కూడా సాఫీగానే ఉంటుంది. వంకరగా ఉందని భ్రమించి భయపడ్డవాడి జీవితమంతా వంకరలతోనే తిరుగుతుంది."

గోపాలం ఏమీ మాట్లాడలేదు. రామమూర్తి చేతిగడియారం వంక చూసి అన్నాడు—

"పదకొండైంది. హోటలు కెళ్లొద్దామా?"

గోపాలం ఆశ్చర్యంగా అతనివంక చూస్తూ అన్నాడు—

"నీక్కూడా హోటలు తిండేం ఖర్మం?"

"ఏం? నేను హోటల్లో తినకూడదా?"

"అబ్బే అదికాదు. నీ పెళ్లామేమైంది?"

"ఆవిడ పుట్టింటిమీద బెంగపెట్టుకొని పయనం కట్టిందిలే." అన్నాడు రామమూర్తి నవ్వుతూ.

గోపాలం ఎంతో వింతగా చూస్తూ, "అయితే నువ్వు తరిమావన్నమాట." అన్నాడు.

రామమూర్తి మళ్లీ నవ్వుతూ, "నీ అల్లే రైలెక్కించి వచ్చానను కున్నావా ఏమిట్రా. రైలుదించి, రెండునాళ్లుండి మరీ వచ్చాను, తెలుసా?" అన్నాడు.

ఇద్దరూ కలిసి హోటలుకెళ్లారు.

ఆ రోజు సాయంత్రం దాకా వాళ్ళిద్దరూ ఎంతో ఆనందంగా చదరంగం మొదలైన ఆటలుఆడి, పాటలుపాడుతూ చివరికి చీకటిపడే సమయానికి సినిమాకి బైలుదేరి వెళ్లారు.

ఉత్తరం ముక్కయినా రాయకుండా, అకస్మాత్తుగా రైలుదిగి ఒంటరిగా ఇంటికి వచ్చిన కూతుర్ని చూసి రాధ తల్లిదండ్రులు అమితంగా ఆశ్చర్యపోయారు.

"ముక్కనీపెట్టి ఓ కార్డుకొని రాసి పోకేస్తే స్టేషనుకొచ్చే వాళ్ళంగా?" అన్నాడు తమ్ముడు.

"టైము లేకపోయిందిరా తమ్ముడూ." అంది రాధ ముసిముసిగా నవ్వుతూ.

"మీ ఆయనేడమ్మా?" అనడిగాడు తండ్రి.

"ఆఫీసులో పని ఎక్కువగా ఉందిట. రెండు మూడు రోజుల్లో ఏదో 'ఇన్స్పెక్షను' కూడా ఉందిట. అంగువల్ల రాత్రిళ్ళుకూడా ఆఫీసులో కూచునే పని చేసుకొంటున్నారు. మళ్లా ఓ వారం రోజుల్లో వచ్చి తీసుకువెడతా నన్నారు." అరగంటనుంచీ రైల్లో ఆలోచించుకున్న అబద్ధం ఆడేసింది రాధ.

"కులాసాగా ఉంటున్నావా? మొహం అంత వాడిపోయిందేమే?" అంది తల్లి, బహుశా రైలుప్రయాణంవల్ల కాబోలు ననుకుంటూ.

"పోవే, నీ మాటలకేం." అంటూ రాధ మేడమీదికి వెళ్ళిపోయింది.

ఆ సాయంత్రం రాధ వచ్చిందన్న వార్త తెలిసి చూసిపోదామని వచ్చింది జానకి. ఇద్దరూ పిట్టగోడమీద కూచుని కబుర్లు చెప్పుకుంటున్నారు. రివ్వన వీచే గాలికి వారి పమిటచెంగులు టపటప కొట్టుకొంటున్నాయి. మాటిమాటికీ మొహంమీద పడుతున్న ముంగురులను సర్దుకొంటూ ఏవో మాటలతో నవ్వుకొంటున్నారు వారిద్దరూ. ఆ మాటా ఈమాటా అడుగుతూ మధ్యలో జానకి అంది—

"మీవారికి వంట్లో కులాసాగా ఉంటోందిటే?"

(18-వ పేజీ చూడండి)

# సింహాద్రిరావు సామర్థ్యం

## శ్రీ టేకుమళ్ల కామేశ్వరరావు

సింహాద్రిరావును, అతనికి తోడుగా శరభాపురం నుంచి వచ్చిన ఉపాధ్యాయులును, కొండపల్లి గ్రామంలో అడుగుపెట్టారు. అతను తన దగ్గిర ఉన్న ఉపాధ్యాయులతో "ఈ ఊరికి ఈ పేరు మహా బాగా సరిపోయింది లెండి! ఇదిగో ఇదే కొండ! ఇదిగిదే పల్లి! కాబట్టి, కొండ ప్లస్ పల్లి ఈజీక్వల్టు కొండపల్లి అని గుడ్డివాడికి సహితం తెలుస్తుంది. కాని ఇక్కడి వాళ్ళే నిజంగా తెలివైన వాళ్లయుంటే, కొండ మొదటిలోనే ఈ ఊరు ఉంది కనుక దీనికి కొండమొదలు అని పేరు పెట్టి ఉండవలసింది. ఆ మాటలలో భావకవిత్వం విజృంభించి వేస్తూంది!" అన్నాడు.

"ఆ పేరున ఒక గ్రామం ఇదివరకే ఉందండి అయ్యా! గోకవరం ప్రాంతాలలో కొండ మొదలు అనే గ్రామం ఒకటి ఉందండి!" అన్నాడు ఒక ఉపాధ్యాయుడు.

"ఇంకేం! మనకంటే ముందే కనిపెట్టివేశాడన్నమాట ఒక మహానుభావుడు! మనమే ఘనులమని, మన మట్టుకు మనం అనుకొని, 'ఊః' పొంగిపోతూంటాము. అన్ని కాలాలలోను ఉంటారయ్యా మహానుభావులు, ఒక్క మనకాలంలోనే కాదు!" అన్నాడు సింహాద్రిరావు.

అతను పాఠశాలలో అడుగుపెట్టాడు. డిప్టీ ఇనస్పెక్టరయిన నందకిశోరరావు ఏవో కాగితాలు చూసుకొంటున్నాడు. అతను తల ఎత్తి సింహాద్రిరావుని చూసి, సుఖంగా వచ్చినందుకు ఆనందపడ్డాడు. శరభాపురం నుంచి వచ్చిన ఉపాధ్యాయులు, కొండపల్లి ఉపాధ్యాయుణ్ణి కలుసుకొని, అతని చెవిలో ఏదో ఊదారు. సింహాద్రిరావు అడివిలో నడిచి నడిచి అలసిపోయాడు. 'ఏవో ఇన్ని కాఫీనీళ్లు తెచ్చి నా మొహాన్ని పారపోస్తే బాగుండును, అని ఎదురుచూస్తున్నాడు. కాని ఆ ధోరణి ఎక్కడా కనబడలేదు. అందుచేత అతను తప్పనిసరిగా నోరు చేసుకోవలసివచ్చింది. "పులికి హారం పడలేదు ఇవాళ!" అన్నాడు కొండపల్లి మేష్టరుతో.

"బాబూ! ఏవో రెండు పాలచుక్కలుంటే, అయ్యగారికి కాఫీ పెట్టి ఇచ్చేవాళమండి. ఈ అడివిలో గిద్దెడు పాలిచ్చే గొడ్డుంటే, దానిని కామధేనువే అని, చుట్టూ చెంబులు పట్టుకొని మూగుతారండి!" అన్నాడు కొండపల్లి ఏకోపాధ్యాయుడు.

తనకి కొంచెమేనా అట్టే పెట్టకుండా నందకిశోరరావుకి అన్నీ ఇచ్చేసినందుకూ, లేకపోతే ఇద్దరికీ లేకపోవాలి, గాని అందులో ఒకడికి అట్టు, ఒకడికి ముక్కా ఏమిటి అనీ, అతను మనస్సులో బాధపడి "నాకు లేకుండా నువ్వెలాగు తాగేశావయ్యా! ఏమన్న పెద్దమనిషివి!" అన్నాడు సింహాద్రిరావు, ఇనస్పెక్టరుతో.

సంభాషణ ఊరికే వింటూన్న నందకిశోరరావు కొండపలి ఉపాధ్యాయుడితో "పంతులూ! మొదటే చెప్పలేకపోయావుటయ్యా ఆ సంగతి! చుక్కలో అరచుక్క అతనికి ఉంచేవాణ్ణి. నాకేం తెలుసు ఈ భోగట్టా అంతా!" అని "జరిగిందేదో జరిపోయింది, కాని ఇప్పుడైనా తొందరగా వెళ్లి, ఎక్కడేనా పుట్టించుకురా! గత్యంతరం లేదు! కదులు! ఇవిగో డబ్బులు!" అని అతను జేబులోంచి పర్సు ఇవతలకి తీశాడు.

"ఎంతమాట! తమ దగ్గిర డబ్బులు పుచ్చుకొంటానా!" అన్నాడు ఏకోపాధ్యాయుడు. కాని అతనికేమీ పాలుపోలేదు.

"అయితే డబ్బులు పుచ్చుకోనూ పుచ్చుకోవు, పాలచుక్కలు తేనూ తేవ వన్నమాట!" అన్నాడు సింహాద్రిరావు.

ఈ ఊరి ఉపాధ్యాయుడిదే పూచీ అంతా, ఇనస్పెక్టరు ఇక్కడికి చేరేక మనకేమీ సంబంధం లేదని, శరభాపురం నుంచి వచ్చిన ఉపాధ్యాయులు నోరు మూసుకొని ఊరుకొన్నారు.

మారు మాటాడకుండా ఏకోపాధ్యాయుడు ఊళ్లోకి పరుగెత్తుకొని వెళ్లాడు.

సింహాద్రిరావు తేగతో కళ్లు వేళ్లాడబడి కూర్చున్నాడు.

అప్పటికప్పుడే చాలా వేళయిపోయింది. సుమారు పన్నెండు గంటలవుతూంది. ఇంతకీ ఒక గంటకిందటే—మన్నెంలో గొడ్లకి కట్టురాటలనుంచి విడుదల అప్పుడు—గొడ్డు గోదలని అడివిలోకి తోలుకుపోయారు. కాని డొంకపక్కని గలగలమంటూ ఏదో వినబడింది. ఏమిటా అనుకొంటూ ఉపాధ్యాయుడు ఒక అడుగు పక్కకి వేసి, కొమ్మలు వంచి, చూశాడు. మెడలో డొల్ల బొణుగు గలగలలాడుతూ మేక ఒకటి కనబడింది. బతుకు జీవుడా అనుకొన్నాడు. అసలు పాలంటూ కళ్ల పడతాయి కదా అని సంతోషించి, కష్టపడి, ఆ మేకని పట్టుకొని, నాలుగు చుక్కలు పిండాడు.

అతను దారిలోనే కోమటి కొట్టుమీద

ఒక కాని ఇచ్చి కాఫీబిళ్లకొని, ఇంటికి వెళ్లి కాఫీ తయారుచేసి, గళాసులో పోసుకొని, చెయ్యి కాలకుండా ఎండు అడ్డాకులతో గట్టిగ పట్టుకొని, గబగబా వచ్చి, సింహాద్రిరావుముందర పెట్టాడు. అతను బ్రహ్మానందపడ్డాడు. వెచ్చవెచ్చగా ఆ వేడినీళ్లు ఇన్ని తాగాడు. అలసిపోయిన బరువుకళ్లు మూతపడ్డాయి. తనకి తెలియకుండానే చాపమీద ఒరిగి నిద్రపోయాడు.

సింహాద్రిరావు నిద్రపోతూండగా శరభాపురంనుంచి వచ్చిన ఉపాధ్యాయులు, సింహాద్రిరావు కొండపల్లి వస్తూ దారిలో తమను పెట్టిన పాట్లు వర్ణించి చెప్పగా, అందరూ నవ్వలేక పొట్టలు చేతితో పట్టుకొన్నారు. స్తబ్ధమైఉన్న అడివిలో చలనం కలిగిస్తూన్నవా డొకడు దొరికాడుకదా అని అందరూ సంతోషించారు. "మేము వెళ్లివస్తాం! సెలవు ఇప్పించండి!" అంటూ శరభాపురంనుంచి వచ్చిన ఉపాధ్యాయులు తిరిగి వెళ్లిపోయారు.

ఇనస్పెక్టరు కొండపల్లిలో పరీక్షు ముగించుకొన్నాడు. రాత్రికి బోయపాడు చేరుకొని, తెల్లవారి తణిఖీపని చూసుకోవాలని తొందరపడ్డాడు. అపరాహ్ణం భోజనాలయేక బండీమీద వెళ్లదలచుకొన్నాడు.

సింహాద్రిరావు భోజనంచేసి, కుర్చీమీద టీక్ గా కూర్చున్నాడు. బీడీ ముట్టించి, ఓరగా మొహంపెట్టి, పొగవిడుస్తూ, పొగతో మేడలు కడుతున్నాడు.

"ఇంకో అరగంటసేపటిలో బయలుదేరి పోదామోయ్!" అన్నాడు డిప్టీ ఇనస్పెక్టరు సింహాద్రిరావుతో.

"చాలామంచిది!" అన్నాడు మిత్రుడు.

"బండీమీద కూర్చుని పోదాం. పాపం! అలిసిపోయి, అలిసిపోయి ఉన్నావు" అన్నాడు ఇనస్పెక్టరు సానుభూతితో.

"సరే! కాని నామాట కొంచెం మన్నించు. బండివాడు మనతో రా అక్కరలేదని చెప్పు" అన్నాడు సింహాద్రిరావు.

"అదేమిటది!" అని ఆశ్చర్యపడ్డాడు ఇనస్పెక్టరు.

"సారథి ఉండగా వేరే బండివాడు ఎందుకయ్యా!"

"ఎవరు సారధి?" అని ప్రశ్నించాడు నందకిశోరరావు.

"నేను సారధిని. నువ్వు పార్థుడవు. వెరసి పార్థ సారథులం. బండియే మనరథం. ఆ ఎడ్లేరథ్యములు. అంటే రథానికి కట్టే గుర్రాలు" అన్నాడు సింహాద్రిరావు.

"ఒద్దుబండి రథ మేమిటి! ఎడ్లు గుర్రాలేమిటి? మనం పార్థసారథుల మేమిటి! ఏమిటీగోల!" అని ఆశ్చర్యం ప్రకటించాడు ఇనస్పెక్టరు.

"అబ్బెబ్బే! నీకింకా తెలియదు! ఇంకా పెరటిదారిలోనే ఉన్నావయ్యా! ఏమి పరీక్షలు చేస్తున్నావో ఏమిటో! పరీక్షలూ అలాగే ఉండి ఉంటాయిలే! సధ్యాచర్చలో ఉన్న అంశాన్ని గురించి—బండి నడపడమనేది ఒక బ్రహ్మాండమైన విద్య కాదు. ఆ మాటకివస్తే, అది చతుష్షష్టకళలు—వావిళ్ల వారి ప్రతిలో—లేనేలేదు. తీరా చెప్పవచ్చే దేమిటంటే, అది మన కాక లెక్కలోని పనికాదు! నేలని చీల్చి, పండించి, గాదినిండా గింజలు పోసుకొనే అస్మదాదులకు, అంటే, ఆ జన్మరహితులకు, అదొక పనా!" అన్నాడు సింహాద్రిరావు పళ్లు బైటపెట్టి.

'తిని కూర్చోక ఇదొక పేలాపన తెచ్చి పెట్టుతున్నాడు!' అనుకొని, ఊరుకొన్నాడు ఇనస్పెక్టరు.

"నేను చెప్పేది ఏమేనా తెలిసిందా?" అని ప్రశ్నించాడు సింహాద్రిరావు.

"తెలియకేం!" అన్నాడు ఇనస్పెక్టరు.

"అర్థమయిందా?" అన్నాడు సింహాద్రిరావు.

"అర్థంకాకేం!"

"బోధపడిందా?" అన్నాడు సింహాద్రిరావు.

"బోధపడకేం!" అంటూ ఇనస్పెక్టరు ఆలోచిస్తున్నాడు.

"భావం అంతుపట్టిందా అని నేనడగడం?" అన్నాడు సింహాద్రిరావు.

"ఇవాళ నీకేగో పట్టింది. నిష్కర్షగా మనకి మూడింది" అన్నాడు నందకిశోరరావు.

"ఇదిగో! అభయహస్తం! కావలిస్తే ఊడదీసి ఇస్తాను! వెనక్కి తగ్గే ఘటం కాదునాయనా!" అన్నాడు సింహాద్రిరావు.

"మనం తీరా ఊరుచేరుకొనేటప్పటికి కాళ్లూ, చేతులూ కలిసిఉంటాయా, లేక తోలుబొమ్మకిలాగు విడదీసి ఉంటాయా అని ఆలోచిస్తున్నాను" అన్నాడు ఇనస్పెక్టరు.

"ఇంకెందుకు? నేను అభయహస్తం మొట్టమొదటే ఇచ్చివేశానుగా!" అన్నాడు సింహాద్రిరావు.

"సరే! సిద్ధపడు!" అన్నాడు మిత్రుడు.

సింహాద్రిరావు లేచాడు. ఎప్పటి వేషం ధరించాడు. అతను కొండపల్లి మేష్టరుతో "పంతులూ! మంచి చేతికర్ర ఒకటి సంపాదించి పెట్టు! ఏమిటి! షికారు వెళ్లడానికి ఫస్టుక్లాసుగా పనికిరావాలి! అది కనక చేతిలో పట్టుకొని నడుస్తూంటే లండన్ దొరగారు ఇప్పుడే స్టీమరుదిగి వస్తున్నారని అంతా బెదిరిపోవాలి" అన్నాడు సింహాద్రిరావు.

"చేతికర్రల కేమిటి లెండి! ఒకటి కాకపోతే పాతిక! ఈ చేతికర్రలని ఇంటిలో ఎవరూ ఉండనియరండి బాబూ! ఎవరో ఒకరడిగి పట్టుకుపోతూనేఉంటారు! ఇంటిలో ఏభైకర్రలు ఉండాలి. ఇప్పుడు చూద్దామంటే పట్టుమని ఒక్కటి లేదు. నేను సొంతంగా వాడుకచేస్తూన్న చేతికర్రఒకటి ఉందిలెండి. దానిని తీసుకువచ్చి తమకి దాఖలు చేసుకొంటాను. మనం వెళ్లేదారిలోనే పాలచెట్లు బోలెడన్ని! కత్తి ఒకటి తీసుకువస్తా."

బండి ఒకమారు ఆపి మంచి సవరైన కర్రలు చూసి తెగకొట్టుకొందాంలెండి! చేతికర్రల కేమొచ్చె!" అన్నాడు పంతులు.

"మంచిమాట సెలవు ఇచ్చావు లే!" అన్నాడు సింహాద్రిరావు.

ఉపాధ్యాయులు లక్కడికి పాతికగజాల దూరంలోనే ఉన్న తన తాటాకు ఇంటికి వెళ్ళి, పాలచేతికర్ర తెచ్చిపెట్టాడు. దానిని చూడగా సింహాద్రిరావు ఆనందానికి మేర లేకపోయింది. డిప్టీ ఇనస్పెక్టరు కూడ ముచ్చటపడ్డాడు. అతను ఎప్పటినుంచో నాలుగు కర్రలు సంపాదించి, అడిగిన పెద్ద మనుష్యులకి బహుమానం చేద్దామని అనుకొంటున్నాడు. కాని అంతవరకు కుదరలేదు.

వాకిటిలో బండి సిద్ధంగా ఉంది. అడుగునంత గడ్డి గాదర వేసి, పైన ఈతాకులచాప పరిచారు. సామానులు బండిలో పడవేశారు సింహాద్రిరావు సొంతంగా తన సూట్‌కేస్ తీసుకువెళ్లి దానిలో పెట్టాడు. ఇద్దరూ బండెక్కి కూర్చున్నారు. ఎడ్ల తలతాళ్లు పట్టకొని బండివాడు ముందు నిలుచున్నాడు. వెనకబడి పంతులు ఉన్నాడు. దూరంగా బంట్రోతు నిలుచున్నాడు.

"సరేకాని అబ్బాయీ! ఇరుసున కందెన పెట్టేవా?" అని బండివాణ్ని సింహాద్రిరావు ప్రశ్నించాడు.

"సిత్తంబాబయ్యా! అన్నాడు బండివాడు.

"మాటలలో ఏడవయ్యా!" అన్నాడు సింహాద్రిరావు.

"సిత్తంబాబయ్యా!" అన్నాడు బండివాడు బెదురుతూ.

"సరే! నిన్ను బళ్లో వేసి పుత్రం పెడితేనే గాని దమ్మిడీకి పనికిరావు! నిన్నడగడం ఎందుకో తెలుసా? ఇరుసున కందెన పెట్టక పరమేశ్వరు బండినయైన పారదు సుమతీ! అన్నాడు శాస్త్రకారుడు. ఇహ మన బండీ ఓలెక్క చెప్పుదూ!" అన్నాడు సింహాద్రిరావు.

"ఇరుసుకు కందెన ఉండదేంటండి!" బాబయ్యా అని బండివాడు తలపాగాఎత్తి బుర్రగోకున్నాడు.

"నేను ప్రశ్నించేనని ఆట్టే శోకించుకోకు! ఈ కాలంలో మిల్లుబట్టలేనా దొరకకుండా ఉన్నాయి!" అన్నాడు సింహాద్రిరావు.

బండివాడు తలపాగ నెత్తిని అణిచేసి "నిజమే బాబయ్యా! గుడ్డముక్కకికూడా కరువైపోయిందండి. సచ్చిపోతున్నాం. తమవంటి పబువులు ఒంటెని సివికిన గుడ్డ ముక్క ఏదేనా పారేస్తేగాని మాలాంటి దిక్కుమాలినవాళ్లు బతికే ఎత్తు లేదండి బాబయ్యా!" అన్నాడు.

నీ బండిపని మాత్రమే నువ్వు చూసుకో అన్నట్టుగా ఉపాధ్యాయుడు బండివాడి వైపు తీవ్రంగా చూశాడు.

"పాతగుడ్డ కేమివచ్చె! ఇచ్చే మాటుంటే కొత్తదోవతే నువ్వు అడగకుండా ఇచ్చేవాణ్ణి. ఈ పురాణాని కేమిటిగాని, వీటిలో దాపటెద్దు ఏది, వలపటెద్దు ఏది? ఒక్క మాటలో చెప్పు. అతి సూక్ష్మగ్రాహిని. ఆ సంగతిమట్టుకు కడుపులో ఉంచుకో?" అన్నాడు సింహాద్రిరావు.

పంతులు అడ్డువచ్చి "ఎడంవైపుది దాపటెద్దు, కుడివైపుది వలపటెద్దునండి" అన్నాడు.

"అందులో ఏమీ తబ్బిబ్బులు లేవు కదా, 'గాదిలో పందికొక్కు, గాదికింద కందిపప్పు' అన్నట్టు. ఎన్నిసార్లు బండెక్కినా, నాకూ అక్కడే తబ్బిబ్బు. నిఘంటుకారులకి అక్కడే తబ్బిబ్బు" అన్నాడు సింహాద్రిరావు.

"లేదు బాబయ్యా" అని బండివాడు ధ్రువపరిచాడు.

"సరే! అంతవరకు బాగానే ఉంది. అయితే, దీని నేమని నడుపుతారు, దానినేమని నడుపుతారు" అని సింహాద్రిరావు ప్రశ్నించాడు.

దాపటెద్దుని హై—హై—హై— అనీ, వలపటెద్దుని చ్చో—చ్చో—చ్చో అనీ నడుపుతారండి!" అన్నాడు బండివాడు.

"నువ్వు బండిశాస్త్రంలో అఖండుడులాగున్నావు!" అన్నాడు సింహాద్రిరావు.

సింహాద్రిరావు ముందర కూర్చుని బండి తోలుతున్నాడు. కాని బొండు ఇసకలలో బండిమట్టుకు ముందుకు జరగడం లేదు. అతను ఎడ్లతోకలు మెలియపెడుతున్నాడు. జువ్వతో బాదుతున్నాడు. ఏమిచేసినా, ఎడ్లు తాపీగా నడుస్తున్నాయి. అతను కొత్తమనిషి అవడంచేత ఎడ్లు బెదురుతున్నాయి. కాని ఇసక అవడంచేత వాటి బెదురు నిష్ప్రయోజనంగా ఉంది.

దారిలో బండి ఒకసారి ఆపారు. సింహాద్రిరావు పాలకర్రల కోసమని దిగేడు. ఇనస్పెక్టరు బండిలోనే పడుక్కున్నాడు. సింహాద్రిరావు, ఉపాధ్యాయుడు కలిసి పాలచెట్ల దగ్గిరకి వెళ్లి, నిబ్బరంగా ఉన్న కర్రలకోసం వెతికి, ఏలాగైతే యేమి, ఒక మోపెడు తెచ్చి, బండిలో పడవేశాడు. వాటిలో ఇనస్పెక్టరుకోసమని ఎంచిఎంచి ఒక వంకర కర్రతీసి ఇవతల పెట్టాడు సింహాద్రిరావు.

అది చూసి ఇనస్పెక్టరు "దానిని కూడ నువ్వే దాచుకో!" అన్నాడు.

"మరీ మంచిది!" అంటూ సింహాద్రిరావు దానిని కూడ కట్టలో కట్టివేశాడు. అంతే కాని మరొక కర్రతీసి ఇయ్యడానికి ప్రాణం ఒప్పలేదు.

సింహాద్రిరావు గిజగిజ కొట్టుకొంటున్నాడు కాని బండి వడిగా వెళ్లడం లేదు.

ఇనస్పెక్టరు బండిలో వెనక కూర్చుని, కాళ్లు కిందికి వేళ్ళాడ వేసుకొని, ఇటు అటు చూస్తూ, కిందనడిచి వస్తూన్న పంతులుతో మాట్లాడుతున్నాడు.

ఇసక నేల అయింది. ఇంతటిలో గట్టి నేల తగిలింది. గట్టినేలకోసం ఎదురు చూస్తూన్న ఎడ్లు, ఆ నేల రాగానే కొంచెం జోరుచేశాయి. అదంతా తన ప్రతాపమే అని సంతోషిస్తూ, సింహాద్రిరావు ఎడ్లని అదలించడం మొదలుపెట్టాడు. అసలే బెదిరిఉన్న ఎడ్లు, ఆదారి విడిచి అడ్డదిడ్డంగా గబగబా పరుగెత్తడం మొదలు పెట్టాయి. "ఆ ఆ"అని అంటూనే ఉన్నారు. ఎడ్లు బండివాడిని లక్ష్యపెట్టలేదు. వాడు వెనకపడ్డాడు. అడుగున్నర ఎత్తున్న మోడు మీదికి చక్రం ఎక్కింది. గబుక్కున ఇనస్పెక్టరు కిందికిదూకి వేశాడు. బండి తలకిందులయింది. సింహాద్రిరావు బండిమీంచి పక్కకి పడ్డాడు. అతను బండిలో ముందు కూర్చుండబట్టి బతికేడు. కాని బండిలోనే కూర్చుని ఉంటే, ఏనడుమో విరిగిపోయేది. అతన్ని లేవదీశారు. పాపం! ఏవో చిన్న చిన్న దెబ్బలు తగిలాయి. ఎలాగో శ్రమపడి బండిని లేవనెత్తారు అంతా కలిసి. సింహాద్రిరావు హడిలిపోయాడు. ఇహ బండి దగ్గిరకి పోదలచుకోలేదు. "బుద్ధిగా లోపలకూర్చో!"అని ఇనస్పెక్టరు అన్నాడు కాని అతను బండిఅంటే బెదిరిపోయాడు. అతను "ఇవి వట్టి అడివి ఎడ్లు! పల్లెడి ఎడ్లయితే ఎంతబుద్ధిగా ఉంటాయి, ఏమిటి కథ! ప్రాణమిచ్చేస్తాయి సమయంవచ్చిందంటే! ఇవి ప్రాణం పుచ్చుకొంటాయి అవసరమైతే!" అన్నాడు.

బండిలో చాల స్థలముందికదా మేష్టరుని కూడ కూర్చోమన్నాడు ఇనస్పెక్టరు. కాని అతను కూర్చోలేదు. సింహాద్రిరావుకి తోడుగా నడచివస్తానన్నాడు. బండివాడు బండిలో కూర్చుని నడిపించాడు క్రమంగా అందరూ బోయపాడు చేరుకొన్నారు.



# నేనెరిగున్న మనిషి

[యూనివర్సిటీ యూనియన్ ఎలక్షన్లంటే అర్థం ఎనిమిది వందల నవ్వుతూన్న ముఖాలు. ఎన్నాళ్లనుంచో వికలమైపోయిన మనస్సును మళ్లీ ఒక్కసారి ఆనందంతో నింపాయి.

ఎప్పుడైనా విశాఖసముద్రంలో వెన్నెల నీడలు చూచారా? దూరాన్నుంచి చూస్తుంటే తాటిచెట్ల చాటుల్లోంచి అందాన్నంతా పిండి ఆరబోస్తుంది సముద్రం.

అందమైన ఆడపిల్ల ముఖం మీద కుంకుమరేఖలా కాచింది చంద్రబింబం - కష్టాలన్నింటినీ మరిపించి చిరునవ్వులా.

దూరాన క్లాక్ టవర్ ఎనిమిది చూపుతోంది. మొగలి పొదల్లోంచి వాసన దూరదూరంగా వ్యాపిస్తోంది, హుమాయూన్ పంచిన కస్తూరిలాగ.

చేతులు విసురుతూ జోరుగా నడుస్తున్నాను. అంతనూ మరచిమరిచిపోని గమత్తు మనస్థితిలో.

ఎవరు నేను? ఏం కావాలి? ఈ ప్రశ్నలన్నీ అణిగిపోయాయి. దూరంగా ఆలోచిస్తే నన్ను నేను మోసం చేసుకుంటున్నానా అనిపించింది. ఇసకలో అడుగు కష్టంగా పడుతోంది. ఎదురుగుండా సముద్రం. ముందుకు పోవడం సాగదు. ఆలోచనలూ ఆగిపోయాయి]

సుబ్రమణ్యం నిజంగా తన్ను తాను మోసగించుకుంటున్నాడు. తన మాటల్తో ప్రపంచాన్నంతా మోసగిస్తున్నానని అతని ఆనందం. అసలు మోసపు కబుర్లు చెప్పి

## "మోన్స"

ముందు తనని తాను మోసగించుకుంటే తప్ప ప్రపంచాన్ని మోసగించటం సాధ్యం కాదని చెప్పినా, ఈ వాదనలో పస అతనికి కనిపించదు.

అతన్ని ఏదేనా ఓ ప్రశ్న అడగండి - వెంటనే ఎంత సమాధానం వస్తుందో, ఉదాహరణకి - ఫలానా సినిమా చూశావా అని అడగండి.

"ఇదివరకే చూశాను. ఆరు నెల్లయింది! మధుబాల! ఫర్వాలేదు. నర్గీస్ కన్న నయం. ఎందుకు బ్రదర్. మొన్న మనం బొంబాయి వెళ్లినపుడు అలా నిలబడి గంటన్నరసేపు చూశాను. చాలా అందంగా వుంటుంది. చాలామంది నేను చూసిన సినిమా తారలు తెరమీద కనిపించేటంత అందంగా వుండరు మామూలుగా చూస్తే. అలా కాదే మధుబాల. చాలా బాగుంటుంది లే. ఆ వేళ స్టూడియోకి వెళ్లాను. ఇంగ్లీషు కూ చక్కగా మాట్లాడుతుంది. ఆంధ్రులంటే ఎంత అభిమాన మనుకున్నావ్... ఒక చిన్న రహస్యం చెప్పనా...ఆమె మొదుగున్నాడే పట్టి దద్దమ్మట. 'మధు' ముందు మన తెలుగుతారలెంత వర్తిచేస్తే... అంతెందుకు - మొన్న మద్రాస్ వెళ్లినపుడు..."

సుబ్రమణ్యాన్ని ఎప్పుడెళ్లావ్ మద్రాసు...ఎందు కెళ్లావ్ అని అడక్కూడదు. అవి చాలా చికాకు పరిచే ప్రశ్నలు.

సుబ్రమణ్యం ఆలోచనలు చాలా ఎత్తుని మేఘాల్లో ఎగురుతూ వుంటాయి అస్తమానం. అమెరికా వెళ్లడంగురించి అమలాపురం వెళ్లడం అంత తేలిగ్గా మాట్లాడుతాడు.

"...ఎందుకు బ్రదర్" బెర్త్ రిజర్వ్ చెయ్యమని ఈ వేళ వ్రాస్తే ఎల్లుండి సాయంకాలానికి ఉత్తరం వస్తుంది. ఓడ ఏజంట్లు నిన్ను ఈగలు ముసిరినట్లు ముసురుతారు. ఇంక ఓడ ఎక్కాక అసలు ఈ ప్రపంచమే నీది కాదనుకో. అక్కడనుంచి ఇంక భోజనం...స్నానం అంత గొడవా వాళ్లదే...టెన్నిస్ ఆడేవాళ్లకి టెన్నీసు... సినిమా చూసే వాళ్లకి సినిమా...డాన్సు చేసేవాళ్లకు అదీ ఇంక అక్కడి క్లాక చగువంటావా? మన దేశంలో వృత్తి నెధవలముందు వాళ్ల ప్రొఫెసర్లు ఎందుకూ పనికి రారనుకో...మన రామం వున్నాడు చూశావా...వాడూ..."

ఇంతకూ అమెరికా వెళ్లడానికి డబ్బెక్కడిది? ఈ ప్రశ్న సుబ్రమణ్యం ఎప్పుడూ ఆలోచించినట్లు కనిపించదు. ఇలాంటి అల్పవిషయాలు అతను ఆలోచించడానికి టైమ్ చాలదు.

చెప్పొచ్చేదేమిటంటే సుబ్రమణ్యంతో మాట్లాడటమనేది నిజంగా ఒక అనుభవం. అందరికీ లభించే సదవకాశం.

అతనితో ఒకసారి ఈ వాగుడు కొంచెం కట్టిపెట్టమన్నాను. ఇలా పేలుతూవుంటే వచ్చే లాభమేమిటి అనిఅడిగాను. అందరూ తన్ని గురించి ఏమనుకుంటున్నారో కొంచెం ఆలోచించమన్నాను. నిర్ఘాంతపోయాడు. కొంచెం చిన్నబుచ్చుకున్నాడు కూడ. "నువ్వనేదేమిటో నాకు బోధపడటంలేదు. నాకు వాక్స్వాతంత్ర్యం లేదా? అయినా నేనేమీ ఎవరికీ హాని చెయ్యటంలేదే." ఈ ధోరణిలో ఇంకా సాగింది. చివరికి అతను తేల్చింది నాకు అసూయ మహోజ్జాస్తిగా వుందని.

నాకు వొళ్లు మండింది. "ఎందుకు - నువ్వు అమెరికా వెళ్తున్నందుకా?"

"వెళ్లిననాడు అందువు గానిలే" అన్నాడు.

ఇంతే జరిగిన దెబ్బలాట. సుబ్రమణ్యం నాతో సరిగా మాట్లాడటం లేదు. ఒక విధంగా నేను విచారించాను. అతని వుద్రేకాన్నీ వుత్సాహాన్నీ అణిచేశానేమోనని. ఇలా ఆలోచించినప్పుడల్లా చాలా కష్టంగా వుండేది.

ఒకనాడు హాస్టల్ అరుగుమీద కూర్చున్నాను. వెనకాలే వచ్చాడు. చల్లగా చెయ్యివేసి పక్కన కూర్చున్నాడు. ఆశ్చర్యపడి చూశాను... "...మా చెల్లెలు పోయింది. నిన్ననే వుత్తరం వొచ్చింది... పదమూడేళ్లు..." అగాడు... "నేను ఎన్నో కలలు కన్నాను. ఒక్కటొక్కటే కూలిపోతున్నాయి..."

కష్టాల్లో కాని మానవుని నిజరూపం బయటపడదు. తనెవరో, తనకి అన్యాయం చేస్తున్న దెవరో, తన పరిస్థితి ఎందుకు ఇలా తయారయిందో వెనక్కి తిరిగి చూసుకుంటున్నాడు సుబ్రమణ్యం ఏదో ఆలోచనల్లో మునిగిపోయి బడిటైమ్ అయిందని లేచిన విద్యార్థిలా...

మనిషి తన్ను ఎక్స్-రే చేసుకుంటున్నపుడు మనిషి ముఖం పసిపాపల ముఖంలా వుంటుంది. దూరపు తన నిజజీవితాన్ని పొరలు పొరలుగా కప్పిన మోసపు తెరలన్నింటినీ, చీల్చుకు చూడగలుగుతాడు జీవితాన్ని.

"అదే. అంతే జరిగింది. అంతా తగలేశాడు నాన్న. అమ్మ ఏదిచేద్దామనుకుంటే సాగుతుంది? తన శాయశక్తులా ప్రయత్నించింది. ప్రతిఫలం? తిట్లూ దెబ్బలూ... ఇప్పుడేమంటాడో తెలుసా నాన్న... అంతా అమ్మేచేసిందంటాడు. దెబ్బలాడని క్షణం లేదింట్లో... చెల్లికి జబ్బుచేస్తే డబ్బులే దింట్లో....నిజంగా లేదు. నువ్వు నమ్మకపోవచ్చు...అమ్మని కొడుతూంటే నన్ను కౌగలించుకు కూర్చొనేది..."కళ్ళమ్మట నీళ్లు గిర్రున తిరిగాయి..."యిదంతా సముద్రం...ఇక ముందుకు సాగలేను..." గొంతు పూడుకుపోయింది...కన్నీళ్లలోంచి ప్రపంచాన్ని చూస్తుంటే అంతా అలుక్కుపోయి ఏమీ లేనట్లు కనిపించిందేమో... మాట్లాడలేదు.

విచారపు మనస్సులకి చిరునవ్వుముఖాలు తగిలించి నడిచే మానవు లెంతమంది? ఒక్కొక్కర్ని నిజం మాట్లాడిస్తే ఎన్నెన్ని గాథలు పైకొస్తాయి...అసలు నా చుట్టూ వున్న ఈ వందల నవ్వుముఖాల్లో, నాది కూడా కలుపుకొని, మొత్తం సుబ్రమణ్యా లెంతమంది?

మన తత్వం తెలుసుకోవటం చాలా సులభం. సినిమాలంటే జనానికి ఎందుకింత మోజు? ఆ రెండుగంటలసేపూ హీరో పడే బాధలన్నీ తనవి....హీరోయిన్ పడే కష్టాలకీ, వైరి 'మొహబత్' పాటలకీ అన్నింటికీ తమ హృదయమూ కంపిస్తుంది. విలన్ పెట్టేకష్టాన్ని కేవలం తన్ని పెడుతూన్నట్లే వుంటుంది. ఈ అనుభూతుల్లో తన చెల్లెలు జబ్బునీ, బట్టలు కనుక్కోలేక పోయిన దారిద్ర్యాన్నీ అంతనీ అలా మరచిపోవడంకోసం.

అదే సుబ్రమణ్యం చరిత్ర-అతని అమెరికా యాత్ర...మధుబాలా దివ్యదర్శనం మొదలైనవన్నీ అతని మనస్సులో సుడిగుండాలను దాచిపెట్టే మహా ప్రయత్నం.

మళ్లీ సుబ్రమణ్యం ముఖంమీద చిరునవ్వు కనిపించలేదు. కొన్నాళ్లకి అతను కనిపంచడమే మానేశాడు.

మా స్నేహితుడు నూర్నారాయణను అడిగాను. "సుబ్రమణ్యం కనిపించటం లేదేం" అని.

"ఎవరతను?" అన్నాడు...

ఎవరని చెప్పను? సుబ్రమణ్యం...అంతే.

"ఇంతమందిలో ఎవరో అతను-వంద సుబ్రమణ్యాలున్నారీ హాస్టల్లో-నోరు మూసుకు పడు...అన్ని గొడవలూ నీకే కావాలి..."

కథ అర్థమవుతూనే వుంది - చెల్లెలు ఎందుకు చనిపోయిందో, అందుకే సుబ్రమణ్యం కాలేజీ మానేశాడు...

[గాలి రివ్వున విసిరింది. సముద్ర కెరటాలు వొచ్చే యుద్ధాన్ని గురించి వార్నింగిస్తున్నట్లు ఏడుస్తూ మొరపెడుతున్నాయి. తాటిచెట్టు మీద పక్షి రెక్కలు టపటప లాడించింది. ఎన్నో వందలమంది నవ్వుతూన్న పళ్లవరసలా సముద్రంమీద కెరటాలు బొమ్మలురాస్తూ చెరిగిపోతున్నాయి. జీవితంమీద పుట్టిన ఆశ్చర్యంతో దూరంగా చూస్తే డాల్ఫిన్స్‌నోస్ కదలకుండా చెదరకుండా అలానే నిలబడివుంది...... జీవితంలా...ప్రపంచంనుంచి ఎప్పటికీ... అంతరించని చిరునవ్వులా...] ★

# కలిమి — లేమి

ఆరోగ్యాకూతురా! మమ్మల్నొదిలి వెళ్ళిపోయావా తల్లీ! అని ఎలుగెత్తి ఏడుస్తోంది ఒక తల్లి. తెల్లవారు ఝాము అయిదయుంటుంది. పల్లెటూళ్ళలో అయితే ఈ వేళకే వీధులన్నీ సందడిగ ఉంటాయి. అందరూ లేచి పనులు చేసుకుంటూ వుంటారు. బస్తీలలో అంత తొందరగా లేచి చేసుకోవలసిన పను లెక్కువ వుండవు. అందువల్లే 5 గంటలకు చాల ప్రశాంతముగ ఉంది. ప్రశాంతతను భగ్నముచేస్తూ ఒక్కసారిగ రోధన ధ్వనులు వినిపించినవి.

నేను తొందరగ వీధి తలుపు తీసుకొని వీధిలోకివచ్చి చూచాను. మా యింటిప్రక్కనున్న కామాక్షమ్మ ఇంటి ముందు జనము మూగి ఉన్నారు. విషయమేమిటో తెలుసుకుందామని వెళ్ళానక్కడికి. ఇంట్లో చనిపోతే ఇల్లు విడిచి పెట్టాలిసి వస్తుందని ప్రాణం పోతూ పోతూ ఉండగా ఆ ఏడేళ్ళ పిల్లను బయటకు చేర్చారట. ఆ పిల్ల తల్లి, తండ్రి, అక్క, చెల్లెళ్ళు, ఇంకా తదితర చుట్టాలు ఏడుస్తున్నారు. వారందరూ ఆ పిల్ల ఎట్లా చనిపోయిందీ వర్ణించుకుంటూ ఏడుస్తున్నారు. ఆ పిల్ల రాత్రికి రాత్రి కలరా వచ్చి గంటల మీద ఎగిరిపోయిందట. ఎంతమంది డాక్టర్లు మందులిచ్చినా లాభం లేకపోయిందట.

కొద్దిగ జ్ఞాపకం వస్తోంది. రాత్రి 3 గంటల ప్రాంతములో కామాక్షమ్మ ఇంటికి కార్లు రావటము, గడబిడగ మాటలు వినిపించినవి. భాగ్యవంతుల ఇళ్ళకు సామాన్యముగ దూరపు బంధువులకు కూడ ప్రేమ లెక్కువై చూచిపోదామని, వారిని విడిచి వెళ్ళలేక అక్కడే పదిరోజులు తిష్ఠవేసుకు కూర్చోటానికి వస్తూ ఉంటారు. అట్లానే తెల్లవారుఝామున ఎవరో చుట్టాలొచ్చారనుకున్నాను. చుట్టాలు రావటానికి వేళలు కూడ ఉండవు కదూ!

మా యింటి చుట్టుప్రక్కల నాలుగయిదు రోజులనుండి కలరావల్ల ఎవరో ఒకరు చనిపోతున్నారు. ఈ రోజు కామాక్షమ్మ కూతురు ఏడేండ్ల ప్రమీల కలరా కావుతయ్యింది. ఆ అమ్మాయి మా అందరికీకూడ చాల ముద్దుగ ఉండేది. పెద్ద వాళ్ళు చనిపోయినప్పటికన్న ఈ వయస్సు పిల్లలు పోయినప్పుడే ఎక్కువ బాధగ ఉంటుంది. చిన్నపిల్లలు వాళ్ళ ముద్దు మాటలతో, చిలిపి చేష్టలతో, నిర్మల ప్రవర్తనలతో, కల్మష రహిత హృదయాలతో అందరికీ ప్రేమ పాత్రులవుతారు.

తెల్లవారింది. పరామర్శించటానికి చాల మంది వస్తున్నారు. మా యింటి ముందున్న ఖాళీ జాగాలో గుడిసె వేసుకు వుంటున్న ఎరికిది నాగమ్మ కూడ పనిలోకి వెళుతూ మమ్మల్నందరినిచూసి అక్కడికి వచ్చింది. ఆ అమ్మాయి ఎట్లా చనిపోయిందని అందరిని అడుగుతూ నా దగ్గర కొచ్చింది. విసుక్కోకుండ కొంచెము ఓపికగానే ఎట్లా చనిపోయిందీ చెప్పాను. అంతా విని నాగమ్మ తన పిల్లలేమయ్యారో, ఎట్లా ఉన్నారో అని త్వర త్వరగ గుడిసెలోకి తిరిగివళ్ళింది. తన పిల్ల లీడు పిల్ల లెవరైనా ఏదైనా ఆపదలో ఉండగా చూస్తే ఏ తల్లికైనా వెంటనే తన పిల్లలు సుఖంగా ఆడుకుంటూ వుండగా తనివితీర చూచుకోనే దాకా మనస్సు కుదుటపడదు. నాగమ్మ గుడిసెవైపు చూశాను. తన పిల్లల నుముగ్గురిని దగ్గఱకు తీసుకొని తనిదీర చూసుకొని హృదయారాటము తీర్చుకొంటోంది.

ఆరోజే సాయంత్రము 6 గంటలకు సంధ్యచీకటిలో మా యింటి ముందున్న గుడిసెలోనుండి రోదనధ్వని వినిపిస్తోంది. ప్రొద్దుటిలాగనే వీధిలోనికి వచ్చిచూచాను. నా కాళ్ళు నాకు తెలియకుండగనే నాగమ్మ గుడిసెవైపుకు దారి తీసినవి. గుడిసెలోనే పిల్లను (చనిపోయిందని) వడిలో పెట్టుకుని నాగమ్మ ఏడుస్తోంది. మిగతా యిద్దరూ చిన్నపిల్లలు "అమ్మా! ఆకలి!" అని ఏడుస్తున్నారు. ఏడవకమ్మా అని అనే వాళ్ళొక్కరుకూడ లేరు ఆమెకు. ఆరోజు ప్రొద్దుటే కామాక్షమ్మ ఇంటిముందు వీధిలో వచ్చేపోయే జనము, చుట్టప్రక్కల వాళ్ళు ఒకటే మూగిపోయారు. కాని ఇప్పుడు నాగమ్మ గుడిసెవారిలో ఏఒక్కరికి కూడ కనుపించటం లేదు. ఒక్కొక్కసారి మనుష్యులు కళ్ళుండి కళ్ళులేనివాళ్ళవలె ప్రవర్తిస్తారు. ఒక్కొక్కసారి వారే వారి కళ్ళకు, చెవులకు అనవసరంగా ఎక్కువ పనికల్పిస్తారు. పాపం! ప్రొద్దుట కామాక్షమ్మ ఇంటిముందు ఒక్క నిముషం

లో శ్రమ అనుకోకుండా రెక్కలు కట్టుకు వాలారు ఎంతోమంది. డబ్బున్న కామాక్షమ్మకు అండలు, పరామర్శలు ఎక్కువవుతున్నాయి. పాపం నాగమ్మకు నిరాశ, నిస్పృహ లెక్కువవుతున్నాయి.

తమ బాధను ఇతరులతో చెప్పుకుంటే కొంత ఉపశాంతి కలుగుతుంది. నాగమ్మ ఏడుస్తూనే తన విషయమంతా నాతో చెప్పింది. భర్త చనిపోయి రెండేండ్లయిందట. ముగ్గురు పిల్లలట. చనిపోయింది పెద్దపిల్ల. ఇంచుమించు కామాక్షమ్మ పిల్ల ఈడే ఉంటుందీ పిల్లకూడ. రెండో పిల్లకు నాలుగయి దేళ్ళుంటాయి. ముడోవాడికి రెండో, మూడో ఏళ్ళుంటాయి. నాగమ్మకు వాళ్ళు ఎప్పుడు పుట్టింది, వాళ్ళ సరిఅయిన వయస్సు ఏమి గుర్తుంటుంది? కామాక్షమ్మ పిల్లలవలె తన పిల్లల కేమయినా పుట్టినరోజు పండుగలు చేస్తోంది గనక నా గుర్తుండటానికి. ఆ పెద్దపిల్ల గుడిశెలోనే డోకులు, విరేచనములు నెళ్ళి తను పనిలోనుండి తిరిగి ఇంటికి వచ్చేటప్పటికి చచ్చి పడిఉందట.

కాసేపటికి ఎవరో ఇద్దరు ఎరికలవాళ్ళు వచ్చి ఆ శవాన్ని తీసుకు వెళ్ళి పాతిపెట్టి వచ్చారు. "పనిచేసి తెచ్చుకున్న డబ్బు ఆ పిల్లను పాతిపెట్టడానికి ఖర్చయిపోయింది. చిన్నపిల్ల లిద్దఱకు తిండి పెడదామంటే చిల్లిగవ్వ లేదు తల్లీ" అని ఏడ్చింది. చనిపోయిందని ఒక ఏడుపు, తిండిలేదని రెండో ఏడుపు.

ఇంటికి వచ్చిన తరువాత మా మామ్మ వాళ్ళు సతాయించటము మొదలుపెట్టారు. మా యింటిప్రక్కలవాళ్ళు 'దీనబంధు'వని ఇంకా ఏవో సూటీ పోటీమాట లన్నారు. వీరూ బాగుపడరు, ఇంకొకరినీ బాగుపడనీయరు' అన్నట్లుగ ఉంటుంది కొందఱి ప్రవర్తన.

మరుచటి రోజునుండే ఏడుపు దిగమ్రింగి నాగమ్మ పనిలోకి యథాప్రకారంగా వెళ్ళుతోంది. పనిలోకివెళ్లక మిగతా ఇద్దరు పిల్లల్ని కూడ చంపుకుంటుందా తిండి పెట్టక.

"కూతురు చచ్చి పూర్తిగ ఒక రోజు అవలేదు. అప్పుడే నాగమ్మ పనికి ఎట్లా వెళుతోందో! ఆ!! అలగా వాళ్ళకు ప్రేమలు, అపేక్షలు ఉంటాయా! కామాక్షమ్మగారు చూడు, నిన్నటి నుంచి ఆ విధాన ఎట్లా పడి ఉందో అన్నము నీరు ముట్టకుండా" అంది నాతో మా మామ్మ.

కామాక్షమ్మ రెండు రోజులు కాదు గదా పది రోజులు పడి ఉన్నా బాధ లేదు. సంపాదించి పెట్టక్కర్లేదు. వండి పెట్టక్కర్లేదు. డబ్బు తగలేశినంత ఉంది. వండి పెట్టటానికి వంట వాళ్ళుంటారుగా భాగ్యవంతులకు. ఇప్పటికే చుట్టాలు చాలమంది వచ్చారు. ఇంకా వచ్చి పడుతున్నారు. వండి పెడుతున్నారు. తింటున్నారు. పెళ్ళిల్లులాగ ఉంది. పెళ్ళిలో సంతోషముగ తిరుగుతారు. ఇప్పుడు కొంచెము విచారముగ తిరుగుతున్నారు. అదే తేడా రెండింటికి.

నాగమ్మకెవరున్నారు. తిండి తినకుండా పనికి వెళ్ళకుండా పడి ఉంటే తన మిగతా పిల్లలను చూచేవాళ్ళెవరు. ఎవరైనా తన కులము వాళ్ళు ఒకరిద్దరు పరామర్శించి, ఒకటి రెండు రోజులు ఉండి పోదామని వస్తే మాత్రము తనెక్కడినుంచి తెచ్చి వాళ్ళకు పెడుతుంది. ★



# జీవితరేఖ

(10-వ పేజీ తరువాయి)

"ఆఁ. ఉండకేం చేస్తుంది. రెండు పూటలా తింటూనే ఉన్నారుగా."

రాధ మొహం ముడుచుకుని జవాబిచ్చింది. ఆమె సమాధానం విని జానకి ఆశ్చర్యపోయింది. ఇంత నిర్లక్ష్యంగా ఆమె ఎప్పుడూ చెప్పనేలేదు. ఇదివరకెప్పుడైనా ఈ ప్రశ్న అడిగితే,

"అబ్బే నేనెంత చెప్పినా ఆయన వింటేనా? 'ఆరోగ్యం కాస్త సరిగా చూసుకోండీ' అని చెబితే 'ఇప్పుడు నా ఆరోగ్యానికేం లోటువచ్చిందిలే' అంటారు." అని చెప్పేది. కాని ఈసారి ఈ ప్రశ్న వేసేసరికి ఎంతో నిర్లక్ష్యంగా సమధానం చెప్పింది. దాంతో జానకికి కాస్త అనుమానం కలిగింది. ఇంట్లో అతనితో పోట్లాడి రాలేదు కదా! అనుకుంది ఆమె. లేకపోతే ఎంత 'ఇన్‌స్పెక్షన్' ఉన్నా మాత్రం వారం రోజుల భాగ్యానికి పుట్టింటికి పంపిస్తాడా? అన్న ప్రశ్న ఆమెలో అంకురించటంతో ఆ అనుమానం మరింత దృఢపడింది. తేల్చుకుందామని అంది జానకి—

"అయితే మీ వారికి పని ఇప్పుడు ఎక్కువగా ఉందా?"

"పోనీలెద్దూ. ఆ గొడవ ఇప్పుడెందుకు. ఇంకా ఏవైనా విషయాలు మాట్లాడు." అంది రాధ విసుగ్గా ప్రసంగం మార్చుదామన్న ఉద్దేశంతో.

ఆమె ఈ విషయంలో విసుగుదల చూపిస్తున్నకొద్దీ జానకికి కుతూహలం పెరుగుతోంది. ఆమె ఎలాగైనా రాధకి చేత అసలు విషయం బయటపెట్టిద్దామని ప్రయత్నిస్తోంది.

"అది కాదు. మొన్నీ మధ్య మీ వారు మా ఆయనకి కనబడి ఓ నెలరోజుల దాకా ఎటువంటి తొందర పనులూ ఆఫీసులో లేవని చెప్పారట, అందుకని అడుగుతున్నాను."

రాధ ఇది విని తెల్లబోయింది. తను అనుకోని సంఘటన జరిగినందుకు ముందు ఆమె నోట మాట రాలేదు. జానకి తనని పరీక్షించటానికే ఇలా చెప్పిందని ఆమె గ్రహించక మెల్లగా అంది—

"ఏమో. నాతో మరి అలా చెప్పారు."

కాని ఈ మాటలు ఆమె నోరు దాటి వెళ్ళాయో, లేదో ఆమెకే తెలీదు. జానకి కాస్త పెద్దగా అంది.

"ఈ సంగతి నిజమేనా?"

రాధ మాట్లాడలేదు.

ఆమె మౌనానికి జానకి నవ్వుతూ "నిజంగా నువ్వు మీ ఆయనతో పోట్లాడి రాలేదూ?" అనడిగింది.

రాధ తల వాల్చుకుంది.

"ఏం?" అంది జానకి రెట్టిస్తూ.

రాధ ఆమెవంక దిగులుగా చూసింది.

"పరవాలేదులే రాధా. నాతో చెప్పు, అసలేం జరిగిందో." రాధకి ఇక చెప్పక తప్పలేదు. అంతా చెప్పి చివరకి,

"పోనీలే, మళ్లీ ఓ వారం రోజుల్లో ఆయనే వచ్చి మహారాజులా తీసుకు వెడతారు." అంది అహంకారంతో.

"ఏం? ఎందుకు వస్తారు?" అంది జానకి.

"లేకపోతే ఆయన కాఫీ హోటలు తిండేం పడుతుంది?"

"మావారు లేరూ?"

"మీ ఆయనకంటే అలవాటు, ఎప్పుడూ 'కాంపు'లకి వెళ్తూ ఉంటారు కాబట్టి. కాని మా ఆయన ఎప్పుడైనా హోటళ్లలో తిన్నారు గనకనా పడటానికి."

"ఏమోలే. ఆయనా కోపంమీదనయినా రాకుండా ఉండవచ్చు."

"మా స్వాంగా" అంది రాధ పందెం వేస్తున్నట్టు.

*    *    *

పొద్దున్నే రామమూర్తి వచ్చి గోపాలాన్ని నిద్రనించి లేపాడు. ఇద్దరూ మొహాలు కడుక్కుని కాఫీ హోటలుకి దారితీశారు. మధ్యలో రామమూర్తి విచారంగా అన్నాడు—

"సారీ బ్రదర్. ఇవాళ అర్జంటుగా ఏదో 'కాంపు' కెళ్ళాలని ఆఫీసరు కబురు పంపించాడు. పొద్దున్నే ప్యూనువచ్చి నిద్రలేపి ప్రయాణానికి సిద్ధం కమ్మన్నాడు. నీతో చెప్పిపోదామని ఇలా వచ్చాను."

గోపాలం నిరుత్సాహంగా, "అలాగా అయితే మళ్లీ ఎప్పుడు రావటం?" అనడిగాడు.

"బహుశా ఓ వారంరోజులు పట్టవచ్చు" అన్నాడు రామమూర్తి సందేహంగా.

"సరే పోయిరా. ఏంచేస్తాం." విచారంగా అన్నాడు గోపాలం.

ఇద్దరూ కాఫీతాగి సెలవు తీసుకుని చెరోదోవ పట్టారు. గోపాలం బరువుగా అడుగులు వేసుకుంటూ ఇంటికి చేరాడు. అతనికి ఇంట్లో ఏమీ తోచలేదు. నిన్నంతా ఆటలతోనూ, పాటలతోనూ గడిపేశారు. కానీ ఇవ్వాళ రామమూర్తి లేడు. పదకొండింటికి ఆఫీసు ఉందిగాని అందాకా ఏం చేసేటట్టు?

గోపాలం నిన్న విసుగుపుట్టి అవతల పెట్టిన పుస్తకాన్నే గతిలేక మళ్ళీ బయటికి తీసి పఠించటం ప్రారంభించాడు.

ఎలాగోలా పదిన్నరదాకా ఆ పుస్తకంతోనే గడిపి హోటల్లో భోజనంచేసి అటునుంచి అటు ఆఫీసుకి వెళ్ళిపోదామని బైలుదేరాడతను.

హోటలుముందు 'మీల్స్ రెడీ' అన్న బోర్డు వేళ్లాడుతూండటం చూసి లోపలికి వెళ్లాడు గోపాలం.

ఓ కుర్చీలో కూలబడ్డ అతనికి కొంతసేపటికి సర్వరు విస్తరి తీసుకువచ్చి టేబిల్ మీద పెట్టబోయాడు. అంతకు పూర్వమే అక్కడ ఎవరో తిని వెళ్ళినట్టున్నారు. ఇంకా ఎంగిలి సరిగా పోనేలేదు. ఆ కుడిచిన మహానుభావు డెవరో గాని గోపాలం ఆ సర్వర్ని వారించి ఆ ఎంగిలి చూపించాడు.

"కడగకపోతే పీడాబోయిరి. ఆ ఎంగిలన్నా సరిగా తుడిపించు" అన్నాడతను చిరాకుగా.

"ఏమిటయ్యా వెధవ ఆచారాలు." అని సర్వరు విసుక్కుంటూ లోపలికి వెళ్ళి

క్లీనరుని పిలుచుకువచ్చి టేబిల్ క్లీన్ చేయించాడు.

ఈ దృశ్యం చూసి పక్క టేబిల్ మీద అన్నం తింటున్న ఒకాయన నవ్వుతూ "అసలీహోటలు వాళ్ళకి శుభ్రత తెలియదండీ." అంటూ ఏదో చెప్పబోయాడు. అతను మాట్లాడుతున్నప్పుడు నములుతున్న మెతుకులు గోపాలం విస్తరిదాకా వచ్చి పడ్డాయి. గోపాలం విసుక్కుంటూ అతను చెప్పబోయే దాని కడ్డువచ్చి,

ముందు మీరు ఆ మెతుకులు మింగి మాట్లాడండి." అన్నాడు కాస్త కఠినంగా.

ఆ పెద్దమనిషి మొహం ముడుచుకొని "చాల్లేవయ్యా." అన్నాడు.

ఇంతలో సర్వరు అటు పోతూంటే గోపాలం అతన్ని పిలిచి "నెయ్యి తీసుకురా." అన్నాడు.

"అణా అవుతుంది ఎక్స్ట్రా."

గోపాలం చిరాకుగా, "సరే తీసుకురా." అన్నాడు.

ఎలాగో ఆపూట భోజనం కానిచ్చి గోపాలం సరాసరి ఆఫీసుకి వెళ్ళాడు.

ఆఫీసులో అయిదుగంటలదాకా గడిపి అటునుంచి అటు పార్కుకెళ్ళాడు, ఎవరైనా స్నేహితులు కనిపిస్తారేమో కాసేపు కులాసాగా గడపొచ్చు అనుకుని. కాని ఆనాడెవరూ రాలేదు. అక్కడో గంటకూచుని చివరికి విసుగుపుట్టి ఇంటికి బయలుదేరాడు.

అరుగుమీద ఇంటిని కావలికాస్తూ శ్రీధరరావు కనిపించాడు. అతన్ని చూసి 'ఎందుకొచ్చినట్టు' అని ఆలోచిస్తూ సమీపించి "ఏమోయ్?" అని పలకరించాడు గోపాలం.

శ్రీధరరావు ఒక చిరునవ్వు నవ్వాడు.

గోపాలం ఇంటికి తాళం తీసి లోపలికడుగు పెడుతూ, "రా" అన్నాడు. శ్రీధరరావు అతన్ని అనుసరించి లోపల ప్రవేశించి ఓ కుర్చీలో కూర్చున్నాడు.

"ఏదో పనిమీద వచ్చినట్టున్నావ్?"

"అబ్బే. ఏమంత పెద్దపని కాదు" అని, "చూడు గోపాలం. ఆ మధ్య నీకు కొంత చేబదులిచ్చాను చూశావూ. అది ఇప్పుడు కాస్త కావలసివచ్చిందోయి. నా దగ్గర ప్రస్తుతం దమ్మిడీ కూడా లేదు. అవతల అప్పులవాళ్ళు వచ్చి నెత్తిమీద కూచున్నారు. లేకపోతే నిన్నసలు అడిగేవాణ్ని కాదు మళ్ళా. నువ్వు తప్పక ఇస్తావని ఆశించివచ్చాను. మొన్ననే కదూ ఫస్టు తారీకు." అన్నాడు సిగ్గుపడుతున్నట్టు.

"అలాగా." అన్నాడు గోపాలం నీరసంగా. శ్రీధరరావుకి ఇవ్వవలసింది పాతిక రూపాయలు. అతనిదగ్గర ప్రస్తుతానికి ఉన్నవి పది రూపాయలు. ఈ పది రూపాయలే మళ్ళీ ఫస్టు తారీకు వచ్చేవరకు వాడుకోవాలి. నిన్ననే పాలూ, పెరుగూ వాళ్ళని పిలిచి వాళ్ళకి రావలసింది ముట్టచెప్పాడు. ఇంటి యజమానిని పిలిచి అతనికివ్వవలసింది ఇచ్చేశాడు. ఇప్పుడు శ్రీధరరావుకి ఏం చెప్పాలో అతని కర్థం కాలేదు. కొంతసేపు ఆలోచించి, "అయితే రేపు పొద్దున తప్పకుండా ఇస్తానోయ్" అన్నాడు. ఆమాట అన్నాడే కాని అతనిలో ఒకవిధమైన నిరుత్సాహం ప్రబలింది. ఇవాళ్టి సాయంత్రం దాకా లేనిడబ్బు రేపు పొద్దుటికల్లా ఎక్కడనించి మొలుచుకొస్తుంది.

శ్రీధరరావు విచారంగా అడుగులు వేసుకుంటూ వెళ్ళిపోయాడు. గోపాలం చిరాకుగా తలపట్టుకుని మంచంమీద వాలాడు. రేపు పొద్దున శ్రీధరరావు కివ్వాలిసిన డబ్బు ఎలా ఇస్తాడో అతనికి అర్థంకావటం లేదు.

పాంటు విప్పేసి లుంగీకట్టుకుని హోటలు కెళ్దామని లుంగీకోసం బీరువా తెరిచాడతను.

లుంగీపక్కన మొన్న అతను తెచ్చిన చీర అతనివంక ఎగతాళిగా చూస్తూకనిపించింది. గోపాలానికి మండింది. తను ఎంతో ఆనందంతో తెచ్చిన చీరని మొత్తానికి తీసుకువెళ్ళకుండానే వెళ్ళిపోయిందన్నమాట రాధ. ఇక తన జన్మలో రాధకి మళ్ళీ చీర తేకూడదనుకున్నాడు.

దాన్ని వాపసుచేసి ఆ డబ్బుతో శ్రీధరరావు బాకీ తీర్చేద్దామని బట్టలకొట్టుకి బయలుదేరాడతను.

షావుకారు ఒక పట్టాన ఒప్పుకోలేదు, ఆ చీర తిరిగి తీసుకోటానికి. కాని గోపాలం ఒదిలిపెట్టకుండా దెబ్బలాడి చివరకి ఓరూపాయి తగ్గించుకుని ఒదిలించుకున్నాడా చీరని.

డబ్బు తీసుకుని ఎకాఎకీ హోటలు కొచ్చేశాడు గోపాలం. ఈసారి కావాలని కిందనే పెట్టించుకున్నాడు విస్తరి. నేలమీద చీమలు బారులు తీర్చి సైనికుల్లా నడుస్తున్నాయి. విస్తరి వేయగానే దాన్ని మూడువైపులనించీ చుట్టుముట్టాయి చీమలు. ఈగలు అన్నంపైన విమానాల్లా తిరుగుతున్నాయి. విస్తరిచుట్టూ అవు పోసనపట్టిన నీళ్ళలో యుద్ధనౌకల్లా ముందుకు చురుచుకొస్తున్నాయి కొన్ని పురుగులు. వీటన్నిటిత గోపాలం హోరాహోరిగా యుద్ధం ఆరంభించాడు. అతనికి ముద్ద మింగుడు పడటం లేదు.

చిటచిట లాడుతున్న అతని మొహం వంక చూస్తున్న కొద్దీ సర్వరుకి మండుతోంది.

తింటూతింటూ ఉన్న గోపాలానికి ఒక్కసారి దోడుకువచ్చినంత పర్యంతమైంది. అతనికి తలతిరుగుతున్నట్టనిపించింది. సర్వరు వంక క్రూరంగా చూస్తూ,

"ఏమిటిది?" అన్నాడు.

"ఏది?"

"ఇదుగో ఇదే కనపడటంలే ?"

"బొగ్గుకాబోలు."

"ఏమిటీ!" అన్నాడు గోపాలం ఆశ్చర్యంగా. అతని కంతకంతకి కోపం ఎక్కువౌతోంది.

"బొగ్గుకదూ ?" అడిగాడు సర్వరు. అది విన్న గోపాలానికి మొన్న తనభార్య కూర చేసినప్పుడు తనన్న మాటలు జ్ఞప్తికి వచ్చాయి. అప్పుడు అందులో పద్ధతి పురుగుకాదని తెలిసికూడా తనన్న మాటలకి ఇప్పుడు కాస్త చింతించాడతను.

"నీ కేమైనా కళ్లున్నాయా, ఊడాయా— చూడు సరిగా." గోపాలం మండిపడుతూ చేత్తో ఇంతలావు బొద్దంకిని చూపించాడు.

సర్వరు అతనివంక కోపంగా చూస్తూ—

"మాటలు సరిగా రానియ్యవయ్యా" అన్నాడు.

మాటలు సరిగా రానివ్వాలేం? నువ్వు పెట్టే అన్నం సరిగా ఉండక్కర్లా."

"నా ఇష్టంవచ్చిన అన్నం పెడతాను. ఇష్టమైతే తిను కష్టమైతే మాను. అంతే కాని ఇక్కడికొచ్చి మాటలంటే పడేవాడెవరూ లేరు."

"పాపం. అలాగేం ?"

"లేకపోతే..."

"నోరు ముయ్యవోయ్."

"ఇదుగో మళ్ళీ చెబుతున్నాను మాటలు జాగ్రత్తగా..."

"రానివ్వకపోతే కొడతావా ?"

"కొట్టక."

"అబ్బో నీబోటివాళ్ళని సవా లక్షమందని చూశాను తెలుసునా?" గోపాలం నిర్లక్ష్యంగా ఎక్కిరిస్తూ అన్నాడు. దాంతో సర్వరుకి మండి, "ఏరా కొట్టేక" అంటూ చొక్కా చేతులు పైకి తీస్తూ సిద్ధమయ్యాడు. గోపాలం చెయ్యయినా కడుక్కోకుండా లేచి ఒక్క రంకె వేశాడు. చెయ్యా చెయ్యా కలిసే సమయానికి అయ్యరు ప్రభృతులంతా వచ్చి సర్దేశారిద్దరినీ.

*　　*　　*　　*

మర్నాటినుంచీ ఇంకొక హోటలులో తిందామనుకొన్నాడు గానీ ఊళ్లోకల్లా మంచి హోటలన్న పేరుగన్న ఆ హోటలే అంత లక్షణంగా ఉంటే ఇంకా తతిమ్మా వాటి సంగతి చెప్పాలా అనుకున్నాడు గోపాలం ఆ రాత్రి.

అసలీ హోటళ్ళలో తినేకంటే ఓ "పాకబోధిని" పుస్తకం తెచ్చుకుని స్వయంపాకం ప్రారంభిస్తే బావుంటుం దనిపించిం దతనికి.

తెల్లవారి నిద్రలేవగానే బజారుకెళ్ళి, పుస్తకమూ, కావలసిన ఇతర వస్తువులూ తెచ్చుకున్నాడతను.

నాలుగు బొక్కెన్ల నీళ్ళు తోడగానే అలవాటు లేని అతని చేతులు కమిలిపోయాయి. అందువల్ల పక్క ఇంటివాళ్ళ సహాయంతో ఓ పనిమనిషిని కుదుర్చుకున్నాడు.

లుంగీ కట్టుకుని, బుజంమీద ఓ తువ్వాలు వేసికుని తొమ్మిది గంటలకి పొయ్యిమీద పిల్లిని లేవదీశాడు అతను. ఒక పెద్ద గిన్నెలో ఓ తవ్వెడు బియ్యం పోసి దానికి నాలుగురెట్లు నీళ్ళుపోశాడు ఇంతకాలంనుంచీ ఎంత బియ్యం తనకి సరిపోతాయో తెలియని గోపాలం.

ఇంకో కుంపటినిండా బొగ్గులు పోసి వాటిని అరగంటసేపటికి అంటించి దానిమీద కూర వేయిద్దామన్న ఉద్దేశంతో ముక్కలు తరగటానికి కత్తిపీట తెచ్చుకున్నాడతను.

వేళ్లని ఆరుసార్లు కోసుకుని ఎలాగోలా ముక్కలు తరగటం పూర్తిచేసి కుంపటిమీద కెక్కించాడా కూరముక్కల్ని.

ఇంతలో బయట "లెటర్ సార్" అంటూ పోష్టుమన్ కేకవేశాడు.

రాధ దగ్గరనుంచి గావున్నుకున్న అతని మనసు ఆనందంతో ఊయల లూగింది. త్వరలోవచ్చి తన్ని తీసుకువెళ్లమని రాసి ఉంటుందనుకొన్నాడతను. తనే సగానన్న ఉత్సాహంతో పోష్టుమన్‌నుంచి ఉత్తరం తీసుకున్నాడు. ముందు క్రింద సంతకం చూసి రాధేనని తెలుసుకున్న అతని కళ్ళు ఆనందంతో విప్పారాయి. ఎంతో వేగంతో చదివాడా ఉత్తరాన్ని అందులో ఇలా ఉంది—

ఈ ఊరుచేరాను. నన్ను మావాళ్లంతో ఆప్యాయంగా ఆదరిస్తున్నారు. ఇక్కడ నాకెంతో సుఖంగా ఉంది. పాపం మీ కక్కడ హోటలు తిండి సరిగా పడక చాలా ఇబ్బందిగా ఉందనుకుంటాను.

రాధ.

ఈ ఉత్తరం చదివిన గోపాలానికి ఒళ్లు పై తెలియనంత కోపం కలిగింది. అతను ఆశించింది అందులో ఏ మాత్రం లేనందుకు అతనికెంతో పశ్చాత్తాపం కలిగింది. ఆమె రాసిన "నన్ను మావాళ్లంతో ఆప్యాయంగా ఆదరిస్తున్నారు." అన్న ముక్క అతని హృదయాన్ని కలచి

## సీలు ఆన్సరు

**నిలువు:** 1. గువ్వ, 2. కేదారము, 3. సభ, 7. కోనకము, 8. కామపాలుడు, 9. శమథము, 10. శయనము, 12. శబలి, 13. ఫలము, 15. విధి. 16. గగనము, 17. నిజము, 18. అవ్వ, 19. నావ

**అడ్డము:** 1. గుహ్యకేశ్వరుడు, 3. గానము, 5. దాహరి, 6. హారతి, 7. కరోటి, 8. కారెము, 11. మది, 12. శపథము, 14. బలము, 15. విహంగము, 17 నిధి, 20. అవ్వ, 21. జలము, 22. క్రమువ.

పైన చూపించినది లక్ష్మీ క్రాస్‌వర్డ్సు No. 1 యొక్క సీలు ఆన్సరు. మీకు ప్రయిజు వచ్చినది అని నమ్మకముఉండి మీ పేరు ప్రయిజులిష్టులో లేనియెడల, ప్రయిజు లిష్టు ప్రచురించిన తేదీమొదలు పదిరోజులలోగా Scrutiny claim (స్క్రూటినీ క్లెయిమ్.) మాకు రిజిష్టరీ పోష్టుద్వారా పంపవలయును. (స్క్రూటినీఫీ క్రింద రు 2/- M. O. ద్వారా పంపిస్తూ M. O. రశీదును జతచేసి పంపవలయును. ప్రయిజులిష్టు 30-10-51 లోగా పంపబడును.

LAXMI CROSS WORDS

వేసింది. తనిక్కడ కొరుక్కు తిన్నాడని కాబోలు ఆమె అభిప్రాయ మనుకున్నాడు గోపాలం. "పాపం మీ కక్కడ హోటలు తిండి సరిగా పడక చాలా ఇబ్బందిగా ఉందనుకుంటాను." అని తన సానుభూతి తెలియజేసిన ఆమె ముక్కలు అతన్ని అమితంగా బాధించాయి. అందువల్ల అతనిలో ఆమెమీద ఉన్న ద్వేషం మరింత వృద్ధిపొందింది.

అతనా ఉత్తరాన్ని ముక్కలు ముక్కలుగా చించి జాజ్వల్యమానంగా వెలుగుతున్న పొయ్యిలో పడేశాడు.

అకస్మాత్తుగా తలుపు తెరుచుకుని లోపల ప్రవేశించిన శ్రీధరరావు గోపాలం అవతారం చూసి ఆశ్చర్యపోయాడు.

ఇంతలో లోపల అన్నం పొంగిన శబ్దం విని శ్రీధరరావుతో కూర్చోమని చెప్పి లోపలికెళ్ళాడతను అన్నపు ఎసరు పొంగి పొయ్యంతా ఆరిపోతోంది. అతను ఆదరాబాదరాగా, ఉత్తచేత్తో మూతతీసి కింద పడేశాడు కాని అతని చెయ్యి దాని వేడికి అంటుకుపోయింది. బాధ భరించలేక 'అబ్బా' అని కేక వేశాడు గోపాలం

కేక విని ఆదుర్దాగా లోపలికి పరిగెత్తుకొచ్చిన శ్రీధరరావు ఈ దృశ్యం చూసి నవ్వాపుకోలేకపోయాడు. అతను నవ్వుతూ ప్రశ్నించాడు.

"ఏమోయ్. 'స్వయంపాకమా ఏమిటి?"

ఈ ప్రశ్నకి గోపాలం ఎంతో సిగ్గుపడ్డాడు. అతను జాలిగా శ్రీధరరావు వంక చూస్తూ—

"అవునోయ్." అన్నాడు.

"ఏం?" అన్నాడు శ్రీధరరావు.

"ఆవిడ పుట్టింటికి వెళ్ళింది."

"అలాగా - పోనీ హోటల్లో తినక పోయావు?"

"ప్రయత్నించాను. కాని హోటలు మీల్సు నాకు పడలేదోయ్." అని లోపలికెళ్ళి అతని కివ్వవలసిన పాతిక రూపాయలూ తెచ్చి అతని చేతి కిస్తూ -

"చాలా ఆలస్యంగా ఇస్తున్నందుకు క్షమించు" అన్నాడు.

శ్రీధరరావు అందుకు సమాధానం చెబుతూ, "పరవాలేదులే ఏమంత ఆలస్యమయింది కనక. అయినా ఈ వగవడబ్బు కావలసివచ్చినప్పుడుండక అక్కర్లేనపుడు కొల్లలు కొల్లలుగా ఉంటుంది. అది సహజమేలే" అని. "వస్తానోయ్" అంటూ సెలవు తీసుకున్నాడు.

గోపాలం లోపలికి వెళ్ళి మాడిపోతున్న కూరని ఓసారి కలియబెట్టాడు.

ఇంతలో ఇస్త్రీ గుడ్డలు తెచ్చిన చాకలతను బయట గోలపెడుతున్నాడు. గోపాలం విసుక్కుంటూ బయటికి వచ్చి అందరూ ఇప్పుడే వస్తారు అనుకుంటూ "ఊరికే అరుస్తావెందుకూ?" అని కసురుకున్నాడు. అతనూ ఊరుకోక "అరగంట నుంచీ పిలుస్తుంటే, ఏమిటండీ" అన్నాడు కాస్త కోపంగా. "తెచ్చేది నాలుగు గుడ్డలూ, వేసేది వలభయి కేకలూనా" అని అలిసిపోయిన వాడల్లే గుడ్డలపద్దు చూసి అతన్ని పంపించేశాడు.

అప్పుడే పదకొండు గంటలైంది. ఇంత వరకు తను అన్నం తిన్నేలేదు. అక్కడ ఏమాత్రం ఆలస్యమయినా అధికారి అరుస్తాడు.

ఒకచోట గుజ్జుగుజ్జై మరోచోట బియ్యం బియ్యంగా ఉన్న అన్నం చూసేసరికి అతనికి మరింత చిరాకు పుట్టింది. దానికితోడు నల్లగా మాడిన కూర. పాపం రోజూ రాధ వీటితో అవస్థపడుతూ ఎలా ఉండేదో అనిపించిందతనికి. అనవసరంగా ఆనాడామెతో పోట్లాడి పుట్టింటికి పంపకుండా ఉంటే తనకీ నాడీ అవస్థ ఉండేది కాదుగదా, అనిపించిందతనికి. కాని వెంటనే ఆమె రాసిన ఉత్తరం స్ఫురణకి రావటంతో అతనికి ఆమెమీద కలిగిన దయ ద్వేషంగా మారింది. పోనీ తనే కోరి తెచ్చుకుని వెళ్ళిపోయిందిగా అనుభవించనీ అక్కడ. మరోవారం ఉంటే బాగా తెలిసవస్తుందిలే పుట్టిల్లంటే ఏమిటో అనుకున్నాడతను.

ఆ అన్నమూ, ఆ కూరా వేసుకు తిని అతను తీరిగ్గా పదకొండున్నరకి ఆఫీసుకి తరలి వెళ్ళాడు.

అరగంట ఆలస్యంగా వచ్చిన గోపాలాన్ని చూసి ఆఫీసరు ఉగ్రుడైపోయాడు.

"ఏం? ఇంత ఆలస్యంగా వచ్చావ్?" అనడిగాడధికారి.

"లేటయిందండి." తల వొంచుకు సమాధానం చెప్పాడు గోపాలం.

"అదే నే నడిగేది. లేటెందుకయిందంట?" మరింత మండిపడ్డాడు ఆఫీసర్.

గోపాలానికి కారణం చెప్పాలో తెలియలేదు. అందుచేత—

"రేపటినుంచి త్వరగా రావటానికి ప్రయత్నిస్తాను సర్." అన్నాడు.

(ఇంకా వుంది)





# జీవనభారం

## "మసూనా"

మనిషివై పుట్టి నీ స్వశక్తితో ప్రపంచకంలో బ్రతకగలవా? బ్రతుకగల ధైర్యముంటే బట్క లేకుంటే మానీ. మనిషిజన్మ యెత్తి మళ్లా పతనమవడం బాగుండదు అని గోపాలం పుట్టినప్పుడు దైవసన్నిభు లెవరూ హెచ్చరించలేదు గనకే భూలోకంలో మనిషై భారవహమయిన సంసార యాతనల్లో నలిగి పతనమయేడు.

రామగోపాలం సమర్థుడైన వ్యక్తి అని నలుగురూ అనుకున్న ఎన్నో సమయాలున్నాయి. కానైతే అతని అదృష్టరేఖ అతని సమర్థతని బయటకు తేలేదు.

రామగోపాలం ఎలాగో చదువుకున్నాడు. చదువు పూర్తయేసరికి మాత్రం చేతిలో ఎఱ్ఱని ఏగాని లేదు. చిన్నప్పటినుండి చాలామందికివలె రామగోపాలానికి పెద్దపెద్ద ఆశయాలేవీ లేవు. సుఖజీవితమే అతడి పరమాశయం. అందుకు డబ్బు కావాలి. ఆలోచించేడు. ప్రయత్నించేడు. కాళ్ళరిగి పోయేట్లు తిరి[illegible]డు. ఆశ్రయించేడు. బ్రతిమలాడేడు. కోమటి కొట్టువద్ద పద్దు వ్రాసేడు. సినీమా టుకింగులో టిక్కట్లమ్మేడు. ప్రైవేటు ట్యూషన్లు చెప్పేడు. ఆఖరుకు ఒక సుముహూర్తాన బేంకిగుమాస్తాగా కుదిరేడు.

నెలకో అరవైరూపాయల పైచిలుకు చేతబడుతూ వచ్చింది. అప్పటప్పటా హోటల్లో స్నేహితులయింటా భోజనం చేస్తూ కాలక్షేపం చేసేవాడల్లా ఒక చిన్న యిల్లు అద్దెకు తీసుకొని స్వయంపాకం ప్రారంభించేడు. వేళపట్టున యింత అన్నం తిని శుభ్రమయిన బట్ట వేసుకొనే స్థితి కలిగింది. యింటో సదుపాయంగా జరగటానికి విధవ అక్కను తీసుకువచ్చేడు. ఆవిడతో తమ్ముడొకడు చదువుకు వచ్చేడు.

కొన్నాళ్ళవరకూ జీవితం ఒక విధంగా సౌఖ్యవంతంగానే నడచింది. కాని ఆ తరువాత ఆ నవారూఢ యవ్వనునిలో ఏదో ఒక అజ్ఞాతశక్తి బయలుదేరి అంతరంగికంగా పీడిస్తోంది.

అప్పటప్పటా సంబంధాలు రాసాగేయి. బంధువుల యోగ్యాయోగ్య నిరూపణల్లో ఏర్చికూర్చిన ఒక కన్యకను పాణిగ్రహణం చేసుకున్నాడు.

ఇన్నాళ్లూ అలా గడిచిపోతూన్న బ్రతుకు హేమ కాపురానికి వచ్చిం తరువాత క్రమ క్రమంగా నదీ సముద్రంవంక దారితీసింది.

చదువుకు చేరోజుల్లో తనకు సహాయపడే దూరపు బంధువురాలొకామె తను పెండ్లి సంబంధాలు వెతుక్కుంటున్నాడని తెలిసి ఒకసారి అంది.

రామగోపాలం తొందరపడి సంసార భారం నెత్తిన వేసుకునే ముందు ఒక్క విషయం తెలుసుకో, సంసారం అంతా యింతా భారం కాదు. లోకమంతా నీనెత్తిన వుంటే ఎంతభారమో అంతభారం. నువ్వు పోషించే మనుష్యులే నిజంగా నీతలమీద కూర్చుంటే నువ్వు లేచి తిరగడానికి ఎంత కష్టపడతావో, ఎంతభారం అనిపిస్తుందో అంత భారంగానూ వుంటుంది సాధారణ సంసారికి. నీవయసూ నీ చక్కదనమూ సంసార సముద్రానికి అర్పితం చేసేముందు పై విషయంకూడా దృష్టిలో పెట్టుకో అంది—

కాని రామగోపాలం ఆవిడమాటలు వినిపించుకోలేదు. ఆమె అలా చెప్పడంలో అంతర్యం గ్రహించలేదు సరికదా ఎందుకలా అందనైనా ఆలోచించలేదు. కానీ ఒకనాటికి తెల్సింది.

హేమతో కూడా నలుగురు వ్యక్తుల చిన్న సంసారాన్ని గడుపుకొనివచ్చేసరికే తలక్రిందు అవలసి రావడం రామగోపాలానికి విస్మయము, విచారము కల్గించేయి.

రోజు రోజూ అనుకోని కొత్త అవుసరాలు వచ్చేవి. వాటికోసం డబ్బు కావలసి వచ్చేది. ఒక నియమితవేతనం, కాలమూ కల రామగోపాలం, కాలం కాని కాలంలో అనియమితమైన అవుసరాలు తీర్చుకోవలసి వచ్చేసరికి చెడ్డ చికాకనిపించేది.

పదిహేనో తారీకు తరువాత దమ్మిడీ మిగల్చలేకపోయేవాడు. ఒకప్పుడు హేమ మిగిల్చిందనే సంశయమున్నా ఆమె సహాయనిరాకరణం చేసేది. నెలాఖరులో మళ్లా యథాతథంగా ఒడుదుడుకులు. బియ్యం కావాలి. బొగ్గులు, కాఫీగుండ కొనాలి. రోజువారీ కూర, పప్పు, ఉప్పు అవీ యివీ యేంటి ఎన్నెన్నో అవుసరాలు క్షణక్షణానికి వస్తూండేవి.

ఒకమారు ఒక స్నేహితుడ్ని అప్పడుగుతాడు ఒకటో తారీకున తీర్చేస్తాడు. మరోసారి నెలాఖరు అవుసరానికి మరో స్నేహితుని అడుగుతాడు. అలాగ్గా ఒకరు, యిద్దరు, ముగ్గురు ఆసరా అవుతారు. మళ్లా పర్యాయం మొదటమిత్రుడే. ఆ తరువాత రెండోమిత్రుడే. పిమ్మట మూడోమిత్రుడు యిలా తన అవుసరాలను అంచీలమీద ఆ ముగ్గురు నలుగురి మిత్రుల మట్టూ తిప్పవలసిందే. కొత్తవా రెక్కడ కుదురుతారు? ఎవ రిస్తారు? అంచేత ఈ సహాయచక్రం పాతపడిపోయింతరువాత రామగోపాలానికి పరపతి సన్నగిల్లిపోయింది. నెలలు, సంవత్సరాలు యీ సహాయచక్రం గరులు అరిగిపోయేయి. క్రొత్తది మార్చ వీలుండేది కాదు.

ఇంటో అందరికీ బట్ట, తిండి, చదువు వినోదం యింకా వున్న అవుసరాలు తనే తీర్చాలి తన ఒక్కని సంపాదనే యింతమందిని సుఖపెట్టితీరాలి. తప్పకొని స్వేచ్ఛగా తిరిగే అవకాశం మృగ్యం. యింట్లో ప్రతివారూ బాధ్యతల్ని సమంగా

(45-వ పేజీ చూడండి)




# ఎత్తుకు పైయెత్తు

శ్రీ కవిరావు



అనగా, అనగా, ఒక గ్రామములో
ఆలీ, మగడూ, ఉన్నారు.
చాలాకాలము గడువగ ఒకనా
డాలితో మగడిట్లన్నాడు:
"ఇంకొక పెండ్లముపై కోరికనా
కున్నది నీ వేమంటావే?"

"ఒక మనుజునకొక భార్య"నిపెద్దలు
ఊరకె సెల విచ్చారండీ?"

"పెద్దలు చెప్పారని నాకేవో
సుద్దులు చెప్పగ జూస్తావే,
బహు భార్యల పెండ్లాడిన కృష్ణుడు
మహనీయుడు కాలేదంటే?"

'అయితేసరి' లెమ్మనుకొని పెండ్లము
అప్పటి కేమియు అనలేదు-
ఇద్దరు భార్యల కోరే మగనికి
బుద్ధి చెప్పవలెననుకొంది.
మరియొకరోజున మగనితో పెండ్లము
మాటల సందున నిట్లంది:
"మరియొక మగనిని పెండ్లాడగ, నా
మనసున కోరిక గలదండీ!"

మగడదివిని, "సీ తస్సాదియ్యా!
తెగదిని పొగరెం తెక్కిందే,
ఆడుది రెండవ మగనిని కోరే
యాచారము మనకేడ్చిందా?"

"మగవారము గద మనకేమనుకొని
తెగమాట్లాడగ తగునండీ?
పతులైదుగురను గలిగిన ద్రౌపది
సతికాదని మీరనగలరా?"
నక్కిళ్ళయ్యకు బడి పాపమ్మక
గుక్క త్రిప్పుకొనగా లేక,
"తెంపలు వేసితి నిక మాటలతో
చంపకె నీ పుణ్య"మ్మనగా.
తగిన శాస్తి జరిగిందని పెండ్లము
తనలో సంతస మందింది-
తాడితన్ను వారొకరుంటే
తల దన్నే వారింకొకరు. 

# ★ జంతువులు - పక్షులు ★



నిప్పుకోళ్లు

## నిప్పుకోడి

దీనిని 'ఎమూ' అంటారు ఇంగ్లీషులో. 'ఆస్ట్రిచ్' అనబడే నిప్పుకోడి కంటే ఇది చిన్నది. ఇది పక్షి జాతికి చెందినదైనా ఎగరలేదు. దీని స్వదేశం ఆస్ట్రేలియా. దీని ఎత్తు 5 నుండి 6 అడుగుల వరకూ, అంటే మనిషి ఎత్తున వుంటుందన్న మాట. ఇది 14 నుండి 25 ఏళ్లవరకూ బతకగలదు.

## జిరాఫీ

ఆఫ్రికాలో అట్లాస్ పర్వతాల దిగువభాగం జిరాఫీలకి ఉనికిపట్టు. బాగా ఎదిగిన జిరాఫీ నిటారుగా నిలబడితే 17, 18 అడుగుల ఎత్తు ఉంటుంది. జంతువుల గొప్పదనాన్ని ఎత్తును బట్టే నిర్ణయించే పక్షంలో జిరాఫీకే అగ్రతాంబూలం వస్తుంది. దీని పై పెదవి పొడుగ్గావుండి, ఆహారాన్ని పట్టుకోడానికి పనికొస్తుంది. నాలిక 18 అంగుళాల పొడుగుంటుంది. ఇది ఎక్కువగా గుబురుగా పెరిగే మొక్కలను, పొదలను తింటుంది. విచిత్రమేమంటే ఈ జంతువు దాదాపు మూగది. ఎంత బాధలో వున్నా సరే కిక్కురుమని కూడా శబ్దం చెయ్యదు. జిరాఫీ చర్మం రెండంగుళాల మందం వుంటుంది. ఇంత మందమైన చర్మంవల్ల దానికి ఉపయోగం వుంది. ఏ క్రూరమృగమైనా వెంబడిస్తే ఇది పారిపోయి దట్టమైన ముళ్ల చెట్లమధ్యకు, అంటే, ఇతర జంతువులేవీ చేరలేని ముళ్ల



జిరాఫీ



చిట్టి జింకలు

కంపల మధ్యకు పోయి దాక్కుంటుంది. మొద్దు చర్మం మూలాన ముళ్లుగుచ్చుకోవు. వీటిని చర్మం కోసం వేటాడతారు. ఒంటె మొదలైన ఎడారి మృగాల్లా గానే ఇది కూడా కొన్ని నెలల దాకా నీళ్లతో అవసరం లేకుండా ఉండగలవు. ఇది సాధారణంగా పిరికిగా, సాధువుగా ఉన్నప్పటికీ కోపం వస్తే ముందరి కాళ్లతో తీవ్రంగాతన్ని పడవెయ్యగలదు. పాపం దానికలాంటి శరీరం దేవు డెందుకిచ్చాడో గాని చాలా అవస్థపడుతూనే వుంటుంది. నేల మీదున్న దేన్నైనా అందుకోవాలంటే అది ముందరి కాళ్లనిఅడ్డంగా బార్లజాపి కష్టం మీద పొడుగాటి మెడవంచిఅందుకుంటుంది. అప్పుడు చూడాలి దాని వికృతాకారం.దాని నడక నడక లాగుండదు. కుడివేపు రెండు కాళ్లనూ ఒకసారీ, ఎడమ వేపు కాళ్లను ఒకసారీ జరుపుకుంటూ పోతుంది, జిరాఫీ గర్భధారణ కాలం 400 నుండి 481 రోజులు. దాని ఆకారం మాట ఎల్లా వున్నా పరిగెత్తడంమాత్రం గంటకి 32 మైళ్లు పరిగెత్తుతుంది. ఇది 13 నుండి 28 ఏళ్లవరకూ బతకగలదు.

## చిట్టి జింకలు

ఇవి దక్షిణ భారత దేశంలో కనిపిస్తాయి. ఆఫ్రికాలో ఉన్నవి ఇంకో మాదిరివి. చిట్టిజింకలు ఒక అడుగుకంటే ఎక్కువ ఎత్తు పెరగవు.

## దుమ్ములగొండి

ఈ జంతువు భారత దేశం అంతటా కనబడుతుంది. వంటి మీద చారలు, దట్టమైన బొచ్చు వుంటాయి. వెనక కాళ్లు పొట్టి. ఇతర జంతువులు చంపి తినగా వదలిన మృగాల మాంసాన్నో, లేక జబ్బు చేసి చచ్చిన మృగాల మాంసాన్నో ఇది ఆప్యాయంగా భుజిస్తుంది. అరణ్యంలో ఎక్కడ కుళ్లుతున్న మాంసం వున్నా ఇది తినేసి శుభ్రం చేస్తుంది. ఎముకల్ని కూడా వదలి పెట్టదు. అతి తేలిగ్గా వాటిని విరిచి నమిలి జీర్ణం చేసుకోగలదు. రాత్రిళ్లు దుమ్ములగొండి అడవుల్లో చాల గొడవ చేస్తుంది. దీని అరుపు భయంకరంగా, ఎవడో రాక్షసుడు వికటాట్టహాసం చేసినట్టు వినిపిస్తుంది.



దుమ్ములగొండి




(బొమ్మలు వాల్ట్ డిస్నీ ప్రొడక్షన్సు,
ఆర్. కె. ఓ. రేడియోవారి సౌజన్యంతో)

**జరిగినకథ :**

మాకు బ్రిస్టల్ నగరసమీపంలో ఒక హోటల్ ఉంది. ఒకరోజున మా హోటలుకు 'బిల్' అనే సముద్రపుదొంగ తనతోటి దొంగలనుండి తప్పించుకుని పారిపోయివచ్చాడు. అతడు మా హోటల్లో ఉన్నాడని మిగతా దొంగలకు తెలిసి, అతన్ని చంపేస్తామని బెదిరించారు. అతడు ఆ బెదిరింపుకే భయపడి చని పోయాడు. అతడు మాకు కొంత డబ్బు బాకీ ఉన్నందున మా అమ్మ, నేను అతని పెట్టె తెరిచి కొంత డబ్బు, ఒక వింతపార్సెలు తీసుకుని సముద్రపు దొంగలనుండి తప్పించుకుని పక్క గ్రామానికి పారి పోయాము. పార్సిలును మా డాక్టరుగారికి, జమీం దారుగారికి చూపాను. దాన్ని తెరిచిచూడగా కాంచనద్వీపపటం కనిపించింది. వెంటనే అక్కడి ధన నిక్షేపాలు సంపాదించే ఆశతో అక్కడికి ప్రయాణమయ్యాము. జమీందారుగారొక ఓడను సిద్ధం చేశారు. స్మాలెట్ అనే అతన్ని కెప్టెనుగాను, లాంగ్ జాన్ సిల్వర్ అనే వాణ్ణి వంటవాడుగాను కుదిర్చారు.

## 10 సముద్రయానం

ఆ రాత్రి మేము ప్రయాణానికి ఆఖరు ప్రయత్నాలన్నీ చేసుకున్నాము. జమీందారుగారి స్నేహితులు, బ్లాండ్లీ మొదలైన వారు మాకు వీడ్కోలు ఇవ్వడానికి చిన్న చిన్న బోట్లలో మా ఓడదాకా వచ్చారు.

తెల్లవారు జామున నాలుగ్గంటలవేళ తండేలు బాకా ఊదాడు. వెంటనే కళాసీలు ఎవరిస్థానాల్లోకి వాళ్లు వెళ్లి పనిచేయ సాగారు. రాత్రి అంతా సామాన్లుసర్దడంలో విపరీతంగా అలిసిఉన్నాను. అయినా సరంబీ మీదనుండి కదల బుద్ధికాలేదు. అంతా కొత్తగా, వింతగా ఉంది; తండేలు బాకా ఊదటం లంగరు పైకి లాగటం, కెప్టెన్ ముక్తసరిగా ఆజ్ఞలివ్వటం, కళాసీలు లాంతర్లు పట్టుకుని ఎవరిస్థానాలకు వాళ్లు పరిగెత్తటం అంతా తమాషాగానే వుంది.

"సిల్వర్! పదంపాడాలి నువ్వు," అన్నాడొకడు.

"మన పాతపాట," అన్నాడింకొకడు.

సరంబీ పిట్టగోడలను ఆనుకుని నుంచున్న సిల్వర్—

"రాసులకొద్దీ రత్నాలోయ్—"

అని గొంతెత్తాడు. కళాసీలు

"యో—హో—హో—బలె సున్నైనరమ్"

అని పల్లవి అందుకున్నారు. వెంటనే లంగరు గొలుసులు పైకిలాగటం ప్రారంభమైంది. లంగరు పైకి రాగానే, తెరచాపలు ఒకదాని తరవాత ఒకటి పైకి లేవసాగాయి. నెమ్మదిగా ఓడ కదిలింది. ఒడ్డు క్రమంగా దూరం కాసాగింది. నేను ఒక గంటగావును కునుకు తీసి లేచేసరికి ఓడ సముద్రమధ్యంలో వుంది. కాంచన ద్వీప ప్రయాణం ప్రారంభమైంది.

సముద్రయానాన్ని పూర్తిగా వర్ణించ దలుచుకోలేదు నేను. అంతా సక్రమంగానే జరిగిపోయింది; పవనాలు అనుకూలంగానే వున్నాయి; ఓడ ఏ ఒడుదుడుకులూ లేకుండా నడిచింది; కళాసీలు సమర్థులనిపించుకున్నారు; కెప్టెన్ సముయానుకూలమైన తెలివితేటలు చూపించాడు. కాని కాంచనద్వీపం చేరే లోగా రెండుమూడు వింత సంఘటనలు జరిగాయి; అవి వివరించవలసిన అవసరం వుంది.

కెప్టెన్ ఊహించిన దానికంటే దరిద్రంగా తయారయ్యాడు మా తండేలు మిస్టర్ యారో. అతన్ని ఎవ్వడూ లెక్క చేసేవాడు కాడు. అతడు ఒకపని చెయ్యమంటే ఇంకోపని చేసేవాళ్లు. అంత

అనువాదం: శ్రీ నండూరి రామమోహనరావు

చులకనై పోయాడు అతడు. అదల్లా ఉంచి రెండు మూడు రోజుల తర్వాత నిత్యమూ చింత నిప్పుల్లాంటి కళ్లు, లోతుకు పోయిన దవడలు, తూలుడు, బూతులు, హఠాత్తుగా తెలివి తప్పిపోవడం మొదలైన లక్షణాలతో కనిపించ సాగాడు మిస్టర్ యారో. ఒక్కొక్కసారి ఓడమీద పడి అటూ ఇటూ దొర్లేవాడు; ఒక్కొక్కసారి రోజంతా మాట్లాడకుండా మత్తుగా పడుకునేవాడు; మళ్లీ రెండుమూడు రోజులపాటు తెలివిగా ఉండి చక్కగా పనిచేసేవాడు.

మాకు విచిత్రం కలిగించిన విషయమేమంటే అతనికి రమ్ ఎక్కణ్ణుంచి వస్తోందా, అని. ఎంత వెదికినా ఎక్కడా రమ్ సీసాలు కనిపించలేదు. "నీకెక్కడిది రమ్?" అని అతన్ని అడిగితే పగలబడి నవ్వి అవతలికి పోయేవాడు; లేకపోతే "నేను చచ్చినంత ఒట్టు. కటికినీళ్లు తప్ప ఇంకేం తాగలేదు," అని అడ్డమైన ప్రమాణాలు చేసేవాడు.

చివరికి మే మనుకున్నంత పనీ జరిగింది. ఒక రోజు రాత్రి అంతర్ధానమై పోయి, మళ్లీ కంటపడలేదు. తెగతాగి, ఒళ్లు తెలియక నీళ్లల్లో దూకి వుంటాడని కెప్టెన్ అన్నాడు. కాని మా ఓడకు తండేలు లేకుండా ఎల్లా? కనుక జాబ్ ఆండర్సన్ అనే అనుభవజ్ఞుడైన కళాసీని తండేలుగా నియమించారు. అతనికి సహాయం చేసేందుకు మా సరంగు (చుక్కాని నడిపేవాడు) ఇజ్రాయెల్ హాండ్స్‌ను నియమించారు.

అందరికంటే విచిత్రమైన వ్యక్తి మా వంటవాడు లాంగ్‌జాన్ సిల్వర్. ఊతకర్రతో ఎప్పుడోగాని అతనికి పనివచ్చేది గాదు. సాధారణంగా దాన్ని మెడలో వేళ్ళాడేసుకుని, తాళ్లు పట్టుకుని, గోడలు పట్టుకుని నడిచేవాడు. ఎంత పెనుగాలిలో నైనా సరే సరంబీ మీద అటూ ఇటూ పచార్లు చేసేవాడు.

అతన్ని గూర్చి మా సరంగు చెప్పాడు: "సిల్వర్ సామాన్యమైన మనిషి కాదు. ఇప్పుడంటే ఇల్లా కుంటుతూ అదో మాదిరిగా ఉన్నాడు కాని ఇదివరకు రోజుల్లో అయితేనా? సింహాలతో అయినా పోట్లాడేంత పొగరుగా ఉండేవాడన్న మాట. మాలోకల్లా కాస్త డొక్కశుద్ధి ఉన్నవాడు వాడే. ఇప్పటికైనా తల్చుకుంటే పుస్తకంలో మాదిరిగా మాట్లాడగలడు. ఇంకెందుకూ? ఒకసారి నేను చూశాను—నలుగురు దున్నపోతుల్లాంటి మనుషుల్ని టపటప పడగొట్టేశాడు, చేతులో కర్రకూడా లేకుండా."

కళాసీ లందరూ సిల్వర్ అంటే గడగడలాడేవారు. కెప్టెన్ స్మాలెట్ కూడా అంత గౌరవమిచ్చే వారు కాదు. అతడు కూడా ఎవరిదగ్గర ఎలా ఉండాలో అలా ఉండేవాడు. అందరితోనూ మంచిగా ఉండేవాడు. ముఖ్యంగా నేనంటే ఎంతో ప్రేమ చూపేవాడు. వంటగదిలోకి పిలిచి ఏమన్నా తింటానికి పెట్టేవాడు.

"రావోయ్, హాకిన్స్! రా. కాసేపు కబుర్లు చెప్పుకుందాం. ఇడుగో మా కెప్టెన్ ఫ్లింట్‌ను చూశావా? సముద్రపు దొంగల నాయకుడు లేడూ? ఫ్లింట్—అతని పేరే పెట్టాను, దీనికి," అంటూ తన చిలకని బుజాలమీదికి ఎక్కించుకునే వాడు. "కెప్టెన్ ఫ్లింట్! ఏమిటి విశేషాలు? తస్సదియ్యా చూశావా హాకిన్స్, మన ప్రయాణం విజయవంతం అగుగాక, అని దీవిస్తోంది చిలక?"

చిలక "పెసో. పెసో, పెసో, పెసో," అని అతి వేగంగా అనేది. (పెసో అనేది స్పెయిన్ దేశపు నాణెం) చివరికి "ఆగు," అని సిల్వర్ గదమాయించే దాకా ఆగేది కాదు.

"ఈ చిలకవయస్సు ఏ రెండు వందల ఏళ్లో వుంటుంది. చిలకలు చాలా ఏళ్లు బతుకుతాయిలే. ఈ చిలక కెప్టెన్ ఇంగ్లండుతో కొంతకాలం వుండేదిట. మడగాస్కర్, మలబారు, సూరినాం, ప్రావిడెన్స్, పోర్టోబెలో—అబ్బ, ఎన్ని చోట్లు చూసిందో, ఎన్ని హత్యలు చూసిందో, ఎన్ని ఓడలు ధ్వంసమవుతుండగా చూసిందో చెప్పలేను. తస్సదియ్యా, గోవా వైస్రాయిగారు దీన్ని కొందామని కూడా అనుకున్నారట. చూడు దాని ముఖం చూస్తే ఎంత చిన్నదానిలా వుంటుందో. కెప్టెన్! నీ కెన్నేళ్లు?"

"తెరచాప లెత్తండి!" అని అరిచేది చిలక.

"బలే చిలకలే, తస్సదియ్యా," అని జేబుల్లోంచి గుప్పిళ్లతో పంచదార తీసి చిలకకి పెట్టేవాడు. చిలక



"బలే చిలకలే, తస్సదియ్య."

అత్యాశ్చర్యకరంగా ఇష్టమొచ్చిన బూతులు తిడుతూ పంచదార తినేది.

కెప్టెన్ స్మాలెట్‌కు, జమీందారుగారికి మధ్య సంబంధాలేమీ అభివృద్ధి కాలేదు. కెప్టెన్ మీద ట్రెలానీగారికి కంఠందాకా వుంది.

తన కోపం దాచాలని కూడా ప్రయత్నించేవారు కాదాయన. మింగేద్దామన్నట్టు చూసేవారతని వంక. కెప్టెన్ తన పని తను చేసుకుపోయేవాడు. పలకరిస్తేనేగాని పలికేవాడు కాదు. అదైనా ముక్తసరిగా మాట్లాడేవాడు. గుచ్చిగుచ్చి అడగ్గా అతడు ఒప్పుకున్నాడు: కళాసీలను గూర్చి మొదట్లో తను అపోహపడ్డానని, హిస్పానియోలా వంటి మంచి ఓడను తానెప్పుడూ చూడలేదని, అయినా ఈ ప్రయాణం సక్రమంగా ముగిసేవరకూ తన కనుమానమే ననేవాడు.

ఈ మాట వినగానే జమీందారుగారు కళ్ళనిప్పులు గక్కుతూ అవతలికి వెళ్ళిపోయేవారు. "ఎప్పుడో మే మిద్దరం దెబ్బలాడుకునేదాకా వస్తుంది. ఆ," అనేవారు.

ఓడ మధ్యభాగంలో అందరికీ అందుబాటుగా ఉండేటట్లు ఆపిల్ పళ్ళ పీపా ఒకటుంది. ఎవడిక్కావలసినన్ని వాడు తెచ్చుకుని తినేవాడు.

"ఎందుకండీ ఆ పీపా అక్కడ, వట్టి దండగ కాకపోతే?" అని ముఖం చిట్లించుకుని అనేవాడు కెప్టెన్.

కాని ఆపిల్ పీపా చివరికి మా ప్రాణాలు రక్షించింది. అదేగనక అక్కడ లేకపోతే మేము ఏమైపోయి వుండేవాళ్ళమో. అసలు జరిగిన దిది :—

మేము కాంచన ద్వీపాన్ని సమీపిస్తున్నాం. రాత్రింబగళ్లు తదేకదీక్షగా టెలిస్కోపులు పెట్టుకుని చూసేవాళ్ళం భూమి కనిపిస్తుందేమో నని. ఆ రోజు రాత్రికో, ఆ మర్నాడు మధ్యాహ్నానికో ద్వీపం చేరుకోగలమని కెప్టెన్ అంచనా వేశాడు. ఓడలోని దిక్సూచిని బట్టి మేము నైరృతిమూలకి దక్షిణంగా పోతు

న్నాము. హిస్పానియోలా ఒడుదుడుకులు లేకుండా ఊగుతూ, తూగుతూ పోతున్నది. అందరం మహోత్సాహంలో ఉన్నాము. ఎందుకంటే మా ప్రయాణం అంతం కావస్తున్నది.

సూర్యు డస్తమించాడు. కెరటాలమీద ఎర్రటి కాంతులు పొడుగ్గా పడ్డాయి. నేను చేయవలసిన పనులన్నీ ముగించుకున్నాను. నేను విశ్రమించే స్థలానికి వెడుతూ మధ్యలో ఆపిల్ పీపాను చూసి ఆగాను. ఒక ఆపిల్ తిందామని బుద్ధిపుట్టింది. చుట్టుపక్కల ఎవ్వరూ లేరు. ఒకళ్ళిద్దరు కళాసీలు పాడుతున్న పల్లెపదాలు గాలి అలలమీద తేలివస్తూ నిశ్శబ్దాన్ని భంగం చేస్తున్నాయి. పీపాలోకి దూకాను. ఎంత తడిమినా ఒక్క ఆపిల్ పండు కూడా దొరకలేదు. అన్నీ అయిపోయాయి. పీపాలో ఒక్క నిమిషం కూర్చున్నానో లేదో ఓడ ఊపుకూ, దూరంనించి అస్పష్టంగా వినిపించే పాట లయకూ ఏదో మత్తు ఆవహించినట్లై, అలాగే ఒరిగి నిద్రపోయాను.

ఎంతసేపల్లా నిద్రపోయానో తెలియదు. ఎవరో బరువైన మనిషి వచ్చి పీపాపక్కనున్న కుర్చీపీటమీద కూర్చుని పీపా నానుకోవడంతో నాకు మెలకువ వచ్చింది. ఆ మనిషిబరువుకు పీపా కదిలిపోయింది. నేను వెంటనే లేచి బయటికి రాబోయాను. ఇంతలో ఆ మనిషి మాట్లాడసాగాడు. అతడు లాంగ్ జాన్ సిల్వరే. అరడజను మాటలు వినేసరికల్లా ఎల్లా వున్న వాణ్ణి అల్లాగే పాతుకుపోయాను గజగజ వణుకుతూ, ముచ్చెమటలు పోస్తుండగా, సిల్వర్ చెప్పే మాటలు వింటూ, కిక్కురు మనకుండా కూర్చున్నాను. ఆ అరడజను మాటలు విన్నగానే నాకు తెలిసిపోయింది— ఓడమీద గల నా స్నేహితులందరి క్షేమమూ నా ఒక్కడిమీదే ఆధారపడి వున్నదని.

# 11. సిల్వర్ కుట్ర

"ఉహూ. నేను కాదు," అంటూ సిల్వర్ ప్రారంభించాడు. "నేను సరంగుగా ఉండే వాణ్ణి. ఫ్లింటే మా అందరికీ కెప్టెన్‌గా ఉండేవాడు. మా ఓడ పేరు వాల్రస్, ఎల్లా ఉండేదనుకున్నావ్? తన్నదియ్యా. ఈ హిస్పానియోలా దానిముందు ఎందుకు కొస్తుంది?"

"కాని ఫ్లింట్ చాలా గొప్పవా డనుకుంటాను. ఆయన పేరు చెబితే రాజులే గడగడలాడేవారుట," అన్నాడు రెండోవాడు. వాడి పేరు డిక్. కళాసీలందరిలోకీ చిన్నవాడు.

"నా చిన్నతనంలో డేవిస్ అని ఒకగొప్ప సముద్రపు దొంగ ఉండేవాడు. తన్నదియ్యా పచ్చి నెత్తురు తాగే వాట్ట. ఆయనతో పనిచేసే అదృష్టం నాకు కలగలేదు. మొదట కెప్టెన్ ఇంగ్లండు కింద, తరవాత కెప్టెన్ ఫ్లింట్ కింద అదీ నా చరిత్ర. మొత్తం మూడు వేల దాకా సంపాయించాను. అదంతా ఎక్కడుంది? ఎక్కడేమిటి? బ్యాంకీల్లో భద్రంగా దాచాను. కెప్టెన్ ఇంగ్లండు మనుషులిప్పు డేమయ్యారు? ఏమో, నాకు తెలియదు. కెప్టెన్ ఫ్లింట్ మనుషు లేమయ్యారు? దాదాపు అంతా ఇక్కడే వున్నారు. ప్యూ చచ్చిపోయాడు. వాడు నా కంటే ఎక్కువ సంపాయించాడు. కాని తన్నదియ్యా పార్లమెంటులో లార్డులాగా, ఏడాదికి పన్నెండువందల చొప్పున తగలేసేవాడు. చివరి రోజుల్లో వాడి గతి ఏమయింది? అడుక్కుతిన్నాడు. దొంగతనం చేసేవాడు పీకలుకోసేవాడు. అయినా మల మల మాడేవాడు."

"పాపం," అని జాలిపడ్డాడు డిక్.

"పాపమేమిటి, వెధవకి. అదే నాకు వళ్లుమంట. ఎవడు తగలెయ్యమన్నాడు డబ్బు? నాలాగా జాగర్తగా ఎందుకు దాచుకోగూడదు? నేనేం కడుపు మాడ్చుకోలేదే. శుభ్భంగా తిన్నాను, తాగాను, అనుభవించాను. కాని మితిమీరి ఎప్పుడు ఖర్చుచెయ్యలేదు నేను. ఇక్కడ కొంత, అక్కడ కొంత అల్లా దాచాను. అంతా ఒకచోట దాస్తే ఎవరన్నా అనుమానపడవచ్చు. నా కిప్పుడు యాభయ్యేళ్లు. ఈ ప్రయాణం నుంచి తిరిగివచ్చాక, ఇక నేను ఘరానాగా పెద్దమనిషిలాగా బతకదలుచుకున్నాను. కాలు మీద కాలేసుకుని, జరిగిపోయినదాన్ని తలుచుకోకుండా నిశ్చింతగా బతకదలుచుకున్నాను. నేనెలా ప్రారంభించాను? నీలాగే. నేనూ ఒకప్పుడు చిన్నకళాసినే."

"నీ డబ్బంతా ఇంకా బ్యాంకుల్లోనే వుందా?"

"నేను పిచ్చివాణ్ణనా నీ ఉద్దేశం? చావు బతుకుల ప్రయాణం మీద బయలు దేరుతూ, బ్యాంకులో వుంచుతానా డబ్బు? అంతాతీసి, మా శ్రీమతి కిచ్చాను. నా హోటలు కూడా అమ్మేశాను. శ్రీమతిని ఫలానా చోట నా కోసం ఎదురు చూస్తూఉండమని చెప్పి పంపాను."

"సరే అసలు విషయం మాట్లాడదాం. ఓడ మీద మనం నమ్మదగినవా ళ్లెంతమందున్నారు?" అని అడిగాడు డిక్.

"సామాన్యంగా దొంగల్లో దొంగలకి నమ్మకం ఉండదు. కాని సిల్వర్ తో వ్యవహారం పాముతో చెలగాటం లాంటిది. నన్ను మోసం చేస్తున్నాడని తెలిస్తే

అవతలివాణ్ణి ఇంకో లోకానికి సాగనంపినదాకా నేను నిద్రపోను. కొందరు ఇదివరకు ప్యూ అంటే గడ గడ లాడే వారు. కొందరు ఫ్లింట్ అంటే భయపడేవారు. కాని ఫ్లింట్, ప్యూ ఇద్దరికీ సిల్వర్‌ని చూస్తే 'సింహ స్వప్నంగా ఉండేది, తన్నదియ్యి. కాని డిక్! నీకు తెలుసుగా, నాతో మంచిగా ఉంటే నే నెంత మంచిగా ఉంటానో. నేను ఊరికే డాబులు కొట్టేవాణ్ణి కాను. వ్యవహారం దగ్గిర మొహ మాటం లేదు నాకు. నువ్వు నన్ను పూర్తిగా నమ్మితే, నేను నిన్ను పూర్తిగా నమ్ముతాను. అదీ నా పద్ధతి."

"సిల్వర్! నువ్వు నిప్పుల్లో దూకమన్నా దూకుతాను. నువ్వు ఏం చెయ్యమంటే అది చేస్తాను," అన్నాడు డిక్.

"నాకు తెలుసు. నీ ముఖం చూడగానే నీ మంచితనం కనిపెట్టాను. నేను చెప్పినట్టు విను, నిన్ను పైకి తీసుకువస్తాను," అన్నాడు సిల్వర్.

నాకు ఆ క్షణంలో సిల్వర్‌ను పొడి చెయ్యాలన్నంత కోపం వచ్చింది. నా దగ్గిర నన్ను పొగడినట్లే, ఆ వెధవ్ని కూడా పొగడుతున్నాడు. అతడు ఎంత నీచుడో అప్పుడు తెలిసింది నాకు.

ఇంతలో మరి ఏడెనమండుగురు కళాసీలు వచ్చారక్కడికి. నేను కూర్చున్న ఆపిల్ పీపా చీకట్లో ఉండడం మూలాన బతికి పోయాను. వాళ్ల కంట బడితే బహుశా నన్ను అక్కడే గొంతు పిసికివుందురు. మృత్యువుకు బెత్తెడు ఎడంలో వున్నా నా మనస్సంతా వాళ్ల మాటల మీదనే వున్నది.

"డిక్ కూడా ఒప్పుకున్నాడు," అన్నాడు సిల్వర్.

"డిక్ ఒప్పుకుంటాడని నా కిదివరకే తెలుసు. ఇప్పుడదికాదు, సిల్వర్! ఎంతకాలం నన్నిట్లా చేతులు కట్టి వుంచుతావ్? కెప్టెన్ స్మాలెట్ ఇచ్చే ఆజ్ఞలు చూస్తుంటే నాకు వొంటిమీద తేళ్లు, జెర్రులు పాకుతున్నట్లుంది. అసలిప్పటికే నన్ను చాలసార్లు అవమానించాడు. వాణ్ణి ఎప్పుడు కసితీరా తందామా అని తొందరగా వుంది. ఈ పళంగా వెళ్లి వాళ్లు తినే ఊరగాయలు, మంచి మంచి కూరలు, ద్రాక్షసారాలు అన్నీ జుర్రుకోవాలనుంది. నువ్వు 'ఊ' అను, నేను దూకుతాను," అన్నాడు సరంగు ఇజ్రాయెల్ హాండ్స్.

"ఇస్రాయెల్! నీకు ఇంత తలకాయ ఉందన్న మాటేగాని, అందులో ఉన్నదంతా మట్టే. నేచెప్పేది విను. నువ్వు మాట్లాడకుండా నీ పని చెయ్యి. నీకేదిస్తే అది తిను. అందరితోను మర్యాదగా, నమ్మకంగా మాట్లాడు. నేను చెప్పినప్పుడు నీ పిస్టల్ ఉపయోగించు దువుగాని," అన్నాడు సిల్వర్.

"అది సరే లేరా. నే నిప్పుడు నువ్వు చెప్పినట్లు చెయ్యనంటున్నానా? నేననేదల్లా, ఎప్పుడూ అని."

"ఎప్పుడేమిటి ఎప్పుడు? నాకు 'ఆ, ఇదే సమయం,' అనిపించినప్పుడు. మతి పోయినట్టు మాట్లాడతావేమిటి? కెప్టెన్ స్మాలెట్ మంచి అనుభవమున్న నావికుడు. ఓడని మనకోసం శుభ్రంగా నడిపిపెడుతున్నాడు. ఇక ఆ జమీందారు, డాక్టరు ఉన్నారు; ఆపటం వాళ్లదగ్గిరే వుందో, మరెక్కడుందో. నేచెప్పేదేమిటంటే, ఆపటం వాళ్లదగ్గిరే వుండనీ. వాళ్లనే అదెక్కడుందో వెదకనీ. వాళ్లనే తవ్వి తియ్యనీ. అది ఓడలో భద్రంగా చేర్చటానికి కావలిస్తే మనం కూడా ఓ చెయ్యి అందిద్దాం. తన్నదియ్య, అప్పుడు చూస్కో మన తడాఖా. మీ కొంచెం ఓర్పు అనేది వుంటే తిరుగుప్రయాణం సగం అయిందాకా ఊరుకుంటాను. ఆతరవాత దేవుడు కాదు, దేవుడు బాబు వచ్చినా సరే ఊరుకోను."

"మనకి ఓడ నడపటం చేతకాదనా నీభయం?" అని అడిగాడు సరంగు ఇస్రాయెల్.

"ఇదుగో, ఇస్రాయెల్! నువ్వు సరంగువి. దారి చూపిస్తే చుక్కాని పట్టడంలో నిన్ను మించినవాడు లేడు. కాని దారిచూపించే వెవరూ అని నే నడిగేది. అంచేత నేను చెప్పినట్టు విను. సమయం వచ్చినప్పుడు నేను పిస్టల్ పేలుస్తాను. ధన్ ధన్‌మని ఒకళ్ల తరవాత

(43-వ పేజీ చూడండి)



"ధన్‌ధన్‌మని ఒకళ్లతరవాత ఒకళ్లని పేల్చేయటం, సముద్రంలోకి తోసెయ్యటం—"

# దానిమ్మపళ్లు

గంగినేని పాలెం అనే వూళ్లో రాముడు అనే కుర్రవాడువుండేవాడు. వాడికో ముసలితల్లి గంగమ్మ వుండేది. రాముడి తండ్రి వాడి చిన్నప్పుడే చనిపోవటంచేత ముసలి గంగమ్మే అష్టకష్టాలూపడి వాడిని పెంచి పదిహేనేళ్లవాడిగా చేసింది.

రాముడికి పదిహేనేళ్లూ నిండినయి. వాడిది నవనీతం వంటి మనస్సు. తనకోసం తల్లి పడుతున్న కష్టాలను చూడలేకపోయేవాడు. అందుచేత తనే ఏమయినా పనిచేసి తల్లి కష్టాలను పోగొట్టాలనుకున్నాడు. ఈసంగతి తల్లితో చెప్పి ఒప్పించి బయలుదేరాడు.

రాముడు అలా పోయిపోయి దూరంగావున్న రామాపురం చేరుకున్నాడు. చేరుకున్నాడేగాని అక్కడ వాడికి పని ఎవరిస్తారు? పనికోసం వూళ్లోవున్న ప్రతిమోతుబరిని యాచించాడు. కానయితే బక్కపలచగా బలహీనంగా వున్న రాముడిని చూసి ఎవ్వరూ పనిలో పెట్టుకోటానికి సాహసించలేదు. ఆఖరికి ఎలా అయితేనేమి తిరగ్గా తిరగ్గా రంగయ్యఅనే పెద్దరైతు వాడిని తనయింట్లో పనిచేసి పెట్టందుకు ఏర్పాటు చేసుకున్నాడు. జీతమయితే రెండు రూపాయలేగాని భోజన సదుపాయాలూ, అవి తనే చేసేందుకు ఒప్పుకున్నాడు. అందుచేత రాముడు అతనిదగ్గర వుండటానికి అంగీకరించాడు.

రోజులు గడుస్తున్నాయి. రాముడు యజమాని మెప్పుకోసం వళ్లువంచి పనిచేసేవాడు. రోజులయితే దొర్లిపోతున్నవిగాని రాముడి జీతంలో మార్పేమీ లేదు. తనకితర ఖర్చులేమీ లేనందువల్ల ప్రతినెలా వచ్చే రెండు రూపాయలనూ భద్రంగా దాచుకునేవాడు.

సంక్రాంతి వచ్చింది. దసరా వచ్చింది. రాముడు యింటికి పోవటానికి రంగయ్య అనుమతి యివ్వలేదు. దీపావళికూడ వచ్చేసింది. రాముడికి తల్లిని చూడాలన్న వుబలాటం హెచ్చయింది. యజమానిని బ్రతిమిలాడాడు. ఆయన వచ్చే సంక్రాంతికిగాని వెళ్లటానికి వల్లకాదన్నాడు. పాపం రాముడు హతాశుడయిపోయాడు. అయితే గంగినేనిపాలెంనుంచి వర్తకం కోసం యీవూరు వచ్చిన కొంతమంది వ్యాపారులు తమవూరు తిరిగి పోవటానికి సంసిద్ధులవుతున్నారు. రాముడికి వాళ్లతో కొంచెం పరిచయముంది. వాళ్లతో తన తల్లికి యిష్టమయిన వస్తువేమయినా పంపించాలని బుద్ధిపుట్టింది. రాముడి తల్లికి దానిమ్మపళ్లంటే చాల యిష్టం. కానయితే వాళ్ల వూరి చుట్టుపట్ల దానిమ్మపళ్లు కాయవు. రాముడికి తన తల్లికిష్టమయిన దానిమ్మపళ్లు పంపించాలనిపించింది. వెంటనే బజారుకు పోయి రెండు మంచి దానిమ్మపళ్లుకొని ఆ వర్తకులకుయిచ్చి తన తల్లికి యిమ్మని చెప్పాడు. వాళ్లు సరేనని బయలుదేరారు.

వాళ్లు అలా గుర్రాల మీద



## శ్రీ కొమ్మూరి వేణుగోపాలరావు

బయలుదేరి మూడురోజులు ప్రయాణంచేసి ఒకవూరు చేరుకుని అక్కడ సత్రంలో బస చేశారు. ఆ వూరికో జమీందారుగారున్నారు. ఆయనకో ముద్దుల కుమార్తె వుంది. పాపం ఆమెకు కొన్నిరోజుల క్రిందట ఒక చిత్రమయిన వ్యాధి సంక్రమించింది. ఎంతమంది వైద్యులు వచ్చినా అసలు వ్యాధి పేరేమిటో కూడ కనుక్కోలేకపోయారు. పాపం జమీందారుగారు చాల దిగులుపడిపోయారు. అయితే ఏరోజయితే వర్తకులు సత్రంలో బస చేశారో, సరిగ్గా ఆరోజునదూరదేశం నుంచి యీ జబ్బు మాటవిని ఒక ఘనవైద్యుడు ఆవూరికి వచ్చాడు. ఆయనకు తెలీని వైద్యం లేదు. ఆయన జమీందారుగారి కుమార్తెను జాగ్రత్తగా పరీక్షచేసి యిలా



అన్నాడు. "ఈవ్యాధి యిప్పటికి చాల ముదిరిపోయింది. ఇంక యిరవయినాలుగు గంటల్లోగా ఒక్క వస్తువును తినిపించకపోతే యీామె జీవించటం కష్టం" అని. ఇది విని జమీందారుగారు "అదేమిటన్నారు" దిగులుగా. "అవా? దానిమ్మపళ్లు. కనీసం రెండు దానిమ్మపళ్లయినా తినకపోతే యీామె జీవించదు" అన్నాడు వైద్యుడు. ఇది విన్న జమీందారుగారి ముఖం వాడిపోయింది. ఎందుచేతనంటే ఆ ప్రాంతాల్లో ఎక్కడా దానిమ్మపళ్లు దొరకవు. పరాయివూరు పోయి తీసుకురావాలంటే రెండు మూడు రోజులు పడుతుంది. ఇంకో యిరవయినాలుగు గంటలలోగానే తీసుకురావాలాయె.

సరే ప్రయత్నం చేద్దామని కొంతమందిని పరాయివూళ్లోకి పంపించి, మరి కొంతమందిని ఆవూళ్లోనే ఎవరన్నా విదేశస్థులు దగ్గర వుంటారేమో వెతుక్కురమ్మని పంపించారు.

ఆ భటులు వూళ్లో కనిపించిన ప్రతివారిని అడుగుతూ సత్రంలో ఎవరయినా విదేశస్థులు వుండక పోరని అక్కడికికూడా పోయారు.

వీళ్లు వెళ్లగానే అక్కడ వర్తకులు కనిపించారు. వాళ్లదగ్గర వుండవేమోనని అనుమానించి కూడ "అయ్యా మీదగ్గర ఏమయినా దానిమ్మపళ్లు దొరకుతాయా?" అని అడిగారు. వర్తకులు యిలా ఎందుకు అడుగుతున్నారో అర్థంకాక వున్నాయన్నారు. ఇక ఆభటుల సంతోషం చెప్ప నలవికాదు. "బాబ్బాబు కాస్త దయచేయించండి. మీకెంతయినా" పుణ్యం వుంటుంది అని బ్రతిమిలాడారు, వాళ్లిలా పళ్ల కోసం ఎందుకు ఆత్రుతపడుతున్నారో తెలియక కారణం అడిగారు. అప్పుడా భటులు వున్న యథార్థం వివరించారు. అయితే పాపం వర్తకులు చిక్కులో పడ్డారు. అక్కడేమోతల్లికోసం ప్రీతితో ఆపళ్లు పంపించాడు. ఇవి కాస్తా వీళ్లకిచ్చేస్తే గంగమ్మ మనస్సు చాలకష్టపడుతుంది. ఇక్కడేమో జమీందారు పుత్రి మరణావస్థలో వుంది. ఈ విషయాన్నే ఆభటులతో చెప్పారు. వాళ్లు "ఇంకో రెండు రోజులాగితే పరాయివూళ్లకి పోయిన మావాళ్లు తిరిగివస్తారు. అప్పుడు మీకెక్కావలిసినన్ని పళ్లు పట్టుకపోవచ్చు" నని చెప్పారు. ఇక విధిలేక ఆ వర్తకులు రెండు దానిమ్మపళ్లూ తెచ్చి భటులకి యిచ్చేశారు.

దానిమ్మపళ్లు కళ్లబడేటప్పటికి జమీందారు గారికి ప్రాణం లేచి వచ్చింది. వైద్యుడు జాగ్రత్తగా ఆపళ్లు మధ్యకు కోయించి జమీందారు పుత్రికకు తినిపించి వేరే వైద్యం చేశాడు వెంటనే. ఆయన చెప్పినట్లు జమీందారు గారి కుమార్తె నిమ్మదిగా కళ్లు విప్పింది.

ఇక జమీందారు గారి ఆనందం దానికి హద్దు లేకపోయింది. ఆయన భటులవల్ల దానిమ్మపళ్ల విషయాన్ని విని దీనికంతటికి కారణం రాముడు అని తెలుసుకున్నాడు. వెంటనే రత్నాలు తెప్పించి యిందాకటి దానిమ్మపళ్ల చెక్కలలో పోసి మళ్లీ మామూలుగా అంటించేసి భటులతో జమీందారుగారికి వీటి అవసరం లేకపోయిందట. అందుచేత అక్కర్లేదన్నారు అని చెప్పి వర్తకులకు యిచ్చేసి రమ్మన్నారు. వారలాగే చేశారు. వర్తకులు కూడా తమ ప్రయాణం ఆగకుండా పోయింది కదా అని సంతోషించి దానిమ్మపళ్లు తీసుకుని, ఆరాత్రికి అక్కడే శయనించి మరునాటి వుదయమే బయలుదేరి మరో నాలుగు రోజులకల్లా తమవూరు చేరుకున్నారు.

వెళ్లి వెళ్లటంతోనే ఆ దానిమ్మపళ్లను ముసలావిడకిచ్చేశారు. ఆవిడ కొడుకుపంపిన బహుమతి కదా అని మురిసిపోయి వాటిని తినకుండా దాచిపెట్టింది. రెండు రోజులు గడిచింతర్వాత యింకా వుంచితే వడిలిపోతాయేమోనని భయంచేత వాటిని బ్రద్దలుకొట్టింది. చూస్తే ఏముంది? కళ్లు జిగజిగ మెరిసిపోయేరత్నాలు. వీటిని చూసి గంగమ్మ ఆనందాశ్చర్యాలలో మునిగిపోయింది. ఇవి కొడుకు సంపాదించి పంపించినవే అనుకుని వాటివిషయం బయటపెట్టక కొడుకు వచ్చేదాక వుంచుదామని వాటిని దాచేసింది.

రోజులు ఎంతలో గడుస్తాయి? సంక్రాంతి వచ్చేసింది. ఈసారి ఎలా అయితేనేం యజమాని కాళ్లావేళ్లాబడి, ఆయన అనుమతి తీసుకుని స్వంతవూరు చేరుకున్నాడు రాముడు. వాడు రాగానే తల్లిసంగతంతా చెప్పింది. రాముడుకూడ వింతపడ్డాడు. అయినా అదంతా భగవంతుని కృపేనని తలిచి పెద్ద భవనం కట్టించి, అందులో సుఖంగా జీవించసాగారు. అదృష్టమంటే అది.



దీపావళి కథ:

# నా మొదటినవల

తూలికాభూషణ్

నా చిన్న తనంలో నేనొక నవల వ్రాశాను. నవల వ్రాయడానికి తగినంత శక్తి సామర్థ్యాలు నాకు అప్పట్లో లేవు. అయినా వ్రాయకతప్పింది కాదు. దానికి దీపావళితో సంబంధం ఉంది అదే చెబుతాను.

చిన్నతనంలో గోరంత విషయమైనా కొండంతగా కనపడుతుంది. ప్రేమ ఆదరము సానుభూతి ఏకొంచెమైనా చూపినవారు కథల్లో మహా కార్యాలు నిర్వహించే రాజకుమారుల్లా కనపడతారు. నిర్దాక్షిణ్యం క్రౌర్యం చూపేవారు రాక్షసులనిపిస్తారు. అలాంటి దుర్మార్గుల్ని అధఃపాతాళలోకానికి అణిచి వేద్దామనిపిస్తుంది. కాని దానికి తగినంత శక్తి లోపిస్తుంది. అప్పుడు ప్రతీకారం తీర్చుకోడానికి, కోపం ప్రదర్శించడానికి మార్గాంతరం అన్వేషించవలసి వస్తుంది. అలాంటి ఘట్టమే నా జీవితంలోకూడా ఉంది.

హైస్కూల్లో నాలుగవ ఫారమ్ చదువుకుంటున్నాను. మాది పల్లెటూరు. అక్కడికి పదిహేను మైళ్ళ దూరంలోఉన్న మరొక ఊళ్ళో హైస్కూలుఉంది. అది పట్టణమూ కాదు,పల్లేకాదు. నగరాల్లో నే పుట్టి అక్కడే చదువుకునే పిల్లలకు, పల్లెటూళ్ళకు చెందిన పిల్లలకు ఒకటే భేదముంది. నగరాల్లో పిల్లలకు పుట్టుకతోనే నాగరికతఅబ్బుతుంది. చదువుకుంటూ ఉన్నప్పటికీ పల్లెటూరి పిల్లలకు పల్లెటూరి దనం పోదు. నా విషయంలో కూడా అంతే.

ఆఏడాది దీపావళి వచ్చింది. దీపావళికి పదిరోజులు ముందే మాతాతయ్యని పీడించి,అనారోగ్య కారణాలపై సెలవు తీసుకున్నాను. దీపావళి సరకులు కాల్చుకోడంలో మూడు ప్రధానమైన దశలు ఉన్నాయి. మొదటిది. తల్లి అమ్మమ్మ బామ్మ అక్కయ్య వగైరా చెయ్యిపట్టుకుని తాటాకు టపాకాయలు, కాకర పువ్వొత్తులు, మతాబులు కాల్పించే బాల్యదశ. (ఇన్ ఫెంట్ క్లాస్) రెండవది. కొంచెం స్వతంత్రించి అరుగుదిగి, తిప్పుడు పొట్లాలు త్రిప్పుకుంటూ, రోలురోకలి పేల్చుకుంటూ, కొంచెం పెద్దమనిషి తరహాగా చిచ్చుబుడ్లు వెలిగిస్తూ బాల్యదశని ఏవగించుకుని, ఆఖరి దశలో ప్రవేశించడం ఎప్పుడా అని ఉవ్విళ్ళూరే మధ్యదశ (మిడిల్ స్కూల్ దశ) మూడవది. ఇల్లు, వీధి ఊరుకూడా విడిచి గుంపులు గుంపులుగా ఏ ఆటల మైదానానికో, చెరువు గట్టుకో, కాలవ గట్టుకో పోయి తూటాలు, తారాజువ్వలు,పిచికలు, వెలక్కాయలతో హోరాహోరి యుద్ధాలు చేసే ఆఖరిదశ. (కాలేజి దశ. పల్లెటూరివారికి హైస్కూల్ దశ.) నేను అప్పుడప్పుడే ఈ మహోన్నతమైన ఆఖరిదశలో ప్రవేశించాను. సరంజామా తయారు చేసుకోవడం కోసం వ్యవధి కావలసివచ్చింది. అందువలనే సెలవు పెట్టాను. మావీధిలో కొంతమంది కుర్రాళ్ళం పోగై తూటాలు, తారాజువ్వలు కట్టాం. మాఇళ్ళలో మధ్యదశ పిల్లలకు తిప్పుడు పొట్లాలుకట్టి ఇచ్చాం.

నరక చతుర్దశికూడా తయారు చేయడంలోనే గడిపాము. దీపావళి నాడు అదృష్టవశాత్తూ ఎండ బాగా కాసింది. సరకులన్నీ ఎండ బెట్టాం. ఊళ్ళో మాతూటాలకి ఎక్కువ ప్రసిద్ధిఉంది. అవితిరిగినంత అయోమయంగా (చూచేవారికి) చురుకుగా మరెవరుకట్టిన తూటాలు తిరగలేవు. జువ్వలసంగతి కూడా అంతమాత్రమే. సరాసరి నక్షత్ర మండలంలోకి, మేము కోరుకుంటే మాకు ఇష్టంలేని ప్రతి ఇంటిమీదికి దాడి చేయవలసిందే. చెరువు గట్టుమీద తూటాలతో ఇతరజట్లమీద యుద్ధం చేయడానికి నిశ్చయించుకున్నాము. సాయంత్రం చీకటిపడిన తరువాత పూజలు

(44-వ పేజీ చూడండి)

# కర్దార్ - కోలినోస్ - "షెరిజా" అందాల పోటీ

★

సినిమా ప్రొడ్యూసర్ కర్దార్, కోలినోస్ (టూత్ పేస్ట్) కంపెనీ, మెట్రో గోల్డ్విన్ మెయర్ ప్రతినిధులు కలిసి జరిపిన అందాల పోటీలో మిస్ పేస్ కమల్ అనే మెడికల్ స్టూడెంటూ, నేపాల్ రాజు మేనల్లుడు సహాదేవరాణా ఉత్తములుగా నిర్ణయించబడ్డారు. అక్టోబరు 12 న బొంబాయి మెట్రో థియేటర్‌లో "షెరీజా" చిత్రం ప్రారంభించబోయే తరుణంలో పోటీలో నెగ్గిన వారంతా ప్రేక్షకులకు పరిచయం చేయబడ్డారు. పోటీకి జడ్జీలు బొంబాయి మేయరు ఎస్. కే. పాటిల్, ప్రొడ్యూసరు ఎ. ఆర్. కర్దార్, శ్రీ కామర్ట్.

పోటీలో గెలిచినవారు మరి రెండు వారాలలో ఇటలీకి బయలుదేరి అక్కడ రెండు వారాలు గడిపివస్తారు. అక్కడ వీరు రోమ్, ఫ్లారెన్స్, పీసా, జినోవా, శాన్‌రీమో, రపాలో, వెనిస్ నగరాలు సందర్శిస్తారట. ఇటలీలో వారికి బ్రహ్మాండమైన స్వాగతం ఇవ్వటానికి ఏర్పాట్లు జరుగుతున్నాయట.

కనుక రాణాలు కాక, మిగిలిన వారిలో ఇద్దరు యువకులకూ, ముగ్గురు యువతులకూ కూడా సినిమా కంట్రాక్టులు లభిస్తున్నవి.

## ప్రపంచ చిత్రప్రదర్శనం

మనదేశంలోని బొంబాయి, మద్రాసు, ఢిల్లీ, కలకత్తా నగరాలలో జరుగనున్న ప్రపంచ సినిమా చిత్రప్రదర్శనం రానున్న జనవరి 24 కు వాయిదా పడింది. ఈ ప్రదర్శనం బొంబాయిలో జనవరి 24 నుండి ఫిబ్రవరి 6 దాకా, రెండు వారాల పాటు సాగుతుంది. అనంతరం మద్రాసుకు వచ్చి ఫిబ్రవరి 13 దాకా, ఒక వారం పాటు మాత్రమే ఉంటుంది. అనంతరం ఢిల్లీలో ఒక వారమూ, కలకత్తాలో ఒక వారమూ ఉంటుంది. బొంబాయితో సమంగా కలకత్తాలో కూడా ఈ ప్రదర్శనం రెండు వారాల పాటు జరుపుకో గలందులకై కలకత్తా వారు ప్రదర్శనాన్ని తాము చివరకు జరుపుకోవటానికి ఒప్పుకున్నారు.

మద్రాసులో ప్రదర్శనం నిర్వహించటానికి ఏర్పడిన స్థానిక కమిటీలో డైరెక్టర్ ఎచ్. ఎం. రెడ్డి, ఫిలించేంబర్ అధ్యక్షుడు వి. రామయ్య, జెమినీ వాసన్ గార్లుంటారు. కేంద్ర సెన్సార్‌బోర్డు యొక్క మద్రాసు ప్రతినిధికే. (స్టాలిన్) శ్రీనివాసన్ ఈ కమిటీకి కార్యదర్శి. అవసరమని తోస్తే ఇతరులను కూడా ఈ కమిటీలో చేర్చుకుంటారు.

ఈ ప్రదర్శనానికి ప్రత్యేకాహ్వానాలు పొందిన వారిలో చార్లీ చాప్లిన్, వాల్ట్ డిస్నీ, సర్ లారెన్స్ ఒలివియర్, సర్ అలెగ్జాండర్ కోర్డా, సెసిల్ బి. డిమిల్, రోసిలినీ, ఇన్గ్రిడ్ బెర్గ్‌మన్ ఉన్నారు.

ప్రదర్శనానికి 45 దేశాలు ఆహ్వానించబడ్డాయి. రష్యా, తూర్పు యూరపు దేశాలనుంచి ఆహ్వానాలకు ప్రోత్సాహకరమైన జవాబులుకూడా వచ్చాయి.

ప్రతి దేశమూ తాను ఏటా తీసే చిత్రాల సంఖ్యకు అనుగుణంగా చిత్రాలను ప్రదర్శనానికి పంపాలి. 30 చిత్రాలకు లోపుగా తయారుచేసే దేశాలు ఒక్క చిత్రాన్ని పంపవచ్చు; 30 లగాయతు 60 లోపు చిత్రాలు తీసే దేశాలు రెండు చిత్రాలనూ, 100 లోపు చిత్రాలను తయారుచేసే దేశాలు మూడు చిత్రాలనూ, 100 పైగా తయారుచేసే దేశాలు నాలుగు చిత్రాలనూ పంపవచ్చు.

బొంబాయిలో ప్రదర్శనం జరిగేటప్పుడు ఈ కింది తరగతుల చిత్రాలలో ఉత్తమమైన వాటికి బహుమానాలివ్వబడతాయి.

- కథా చిత్రాలు
- డాక్యుమెంటరీ చిత్రాలు
- విద్యా విషయిక చిత్రాలు
- కార్టూను చిత్రాలు
- శాస్త్ర విషయిక చిత్రాలు
- ఆసియా చిత్రాలు
- భారతీయ చిత్రాలు

ఉత్తమ భారతీయ చిత్రానికి ఇండియా ఫిలిం ఫెడరేషన్ వారు బహుమానం ఇస్తారు.

మద్రాసు కమిటీవారు కోరిన పక్షంలో ఉత్తమ దాక్షిణాత్య చిత్రానికి ఒక బహుమానం ఏర్పాటు చేయవచ్చు.

చిత్రాల యోగ్యత నిర్ణయించటానికిగాను కలకత్తా, ఢిల్లీ, మద్రాసు, బొంబాయిలనుండి 20 మొదలు 30 మంది వరకు జడ్జీలు ఏర్పాటు కానున్నారు. ★



యువపిక్చర్సువారి "టింగురంగా"లో ఒకదృశ్యం.

# ఉపపాత్రలు



అన్ని పెద్ద కథలలో నాయికా నాయకుల కన్న ఉపపాత్రలు ఆయువుపట్లు అవడంవల్ల కథ సజీవంగా కనబడడం సహజం. నిత్యజీవితంలో ఒక సర్వసాధారణ వ్యక్తిని తీసుకొంటే అతని జీవిత కథకి అతడి మనస్తత్వం ఎంత ప్రాతిపదికో - అతడి చుట్టూ వున్న ఇతరేతర వ్యక్తులుకూడా అంత అవసరం. అసలు మనస్తత్వం అన్నది ఏర్పడడానికి చుట్టూవున్న వ్యక్తుల చేతలు, రీతులు కారణభూతులు. 'నేను' అన్న వాడి జీవితంలో 'నువ్వు' అన్న వ్యక్తి లేకపోయినా ఫరవాలేదు గాని, 'వాడు' 'అది' 'ఆమె' మొదలైన వ్యక్తులు వస్తువులు, ప్రాణులు లేకపోతే అసలు కథే లేదు. 'వాడు' 'అది' 'ఆమె' అనే జీవుల ప్రభావం ఒక వ్యక్తిమీద ఎంత బలీయంగా ఉంటుందో, కథకూడా అంత సకారణంగా ఉంటుంది. ఉపపాత్రలవల్లే కథ సాగడం ఎన్నడూ ప్రమాదం కాదు; అది విధాయకం. అయితే ఫలానా పాత్రవల్ల కథ నడిచింది అని ప్రస్ఫుటంగా కనబడక పోతే ఇబ్బంది లేదు సరికదా, కథా రచనలో నేర్పరితనం కూడా అవుతుంది.

'కన్యాశుల్కం' లో రెండు దృశ్యాలు ఈ మాదిరివి వున్నాయి. ఒకటి సారా దుకాణం దృశ్యం, రెండు పేకాట దృశ్యం. ఈ రెండూ నాటకంలో అటు తరువాతి కథ జరగడానికి హేతుభూతా లయినాయి. రెండూ సుదీర్ఘాలు. రెండింటి వల్లా కథ నడిచినట్టు మొట్టమొదట చదివిన వాడికి చప్పున కనబడక పోవచ్చు. అయినా - రామప్పంతులు దుకాణానికి వచ్చి ఖూనీ కేసు అని లుబ్ధుణ్ణి బెదిరించ మని హెడ్డుని అడగడం - సాక్షులని తయారుచేయడం నాటకంలో ఆఖరి కథ నడవడానికి బీజాలు అయినాయి.

## "ఆరంధ్ర"

అలాగే నేటి చలనచిత్ర కథల్లో కూడా కొన్ని దృశ్యాలూ, కొన్ని ఉపపాత్రలు కథ నడిచిన విధంగానే నడవడానికి తోడ్పడడం హర్షించ తగిన విషయం. ఈ సంవత్సరం విడుదల అయిన కొన్ని చిత్రాలలో ఈ విషయం, అక్కడక్కడ సున్నితంగా, అప్పుడప్పుడు సహజంగా, కొన్ని చోట్ల గంభీరంగా ఉన్నది. వాటిని నిర్మాణాత్మకమైన విమర్శనా దృష్టితో పరిశీలించడం సాంకేతిక నిపుణుల ధర్మం.

పాతాళభైరవి చిత్రం అంతటికీ ఆయువుపట్టు అయిన ఉపపాత్ర 'సదాజపుడు'! ఈ పాత్రని మాంత్రికుడే గౌరవించడు. కావనగా, సేవకుడిగా మాత్రమే ఈ పాత్రని ఎన్నికచేస్తాడు. ఎన్నడూ శిష్యుడి కింద ఎంచడు, ఎప్పుడూ 'డింగరీ' అనే పిలుస్తాడు. మాంత్రికుడి ఇతరేతర డింగరీలు (సేవకులు) మటుకూ అతణ్ణి 'చిన్న గురువు' అని పిలుస్తారు. గౌరవిస్తారు. ఆ పాత్ర - ఒక ఘట్టంలో మాంత్రికుడికే మొత్తంమీద చిత్రానికి ప్రాణం పోసింది. ఈ పాత్ర పరిపోషణలో రచయితా, దర్శకుడూ చాలా శ్రద్ధవహించారు. [illegible] చూపేరు. కథ ప్రారంభించేటప్పుడే ఫలానా ఉపపాత్రవల్ల కథ నడుస్తుందని నిర్ణయించడం రచయితకూ, దర్శకుడికీ, ప్రాథమిక కర్తవ్యమైనా, నేటి పరిస్థితులలో అది ప్రశంసనీయమైన విషయం. కథ [illegible]లో ఎప్పుడో మాంత్రికుడికి ప్రాణం పోయాల్సి కాబట్టి, మొదటి దృశ్యంలోనే 'సంజీవిని' చూపడం, సంజీవి ప్రయోగించే విధానం సదాజపుడికి తెలిసి ఉండడం చాలా ముఖ్యమైన అంశాలు. దీనిని బలీయం చేయడానికి గాను మాంత్రికుడు ఒకటికి రెండుసార్లు 'సదా జపా' అని కేకేసి, "సంజీవి సిద్ధము కాయరా" అని పురమాయిస్తాడు. "సిద్ధముకాయరా" అని గద్దిస్తాడు. వాస్తవానికి సదాజపుడు ప్రభుభక్తి పరాయణుడు. అటువంటి వాడు "[illegible] [illegible] ఉండడం" సహజం. అదికాక - హాస్యభాగాన్ని బలి వేయడం



అరుణోదయ వార్షికోత్సవంలో పాల్గొన్న పెద్దలు-పిన్నలు.
శ్రీయుతులు గోపీచంద్, రాజేశ్వరరావు, వార్ల వెంకటేశ్వరరావు, కృష్ణకుమారి, పి. వి. కృష్ణవేణి, మిద్దె రామకృష్ణారావు, యస్. కనకరావు మొదలైనవారున్నారు.

మాట ముఖ్యమైనా – ఆరాధనా విగ్రులలో గురు సన్నిధిని ఉండకతప్పదు. కాని, పాత్రని తొలిసారి ప్రవేశ పెట్టడంకొబట్టి, సంజీవి విషయం ప్రగాఢంగా ప్రేక్షకునికి తెలియచేయాలి కనుకా రచయితా, దర్శకుడూ, ఒకటికి రెండుసార్లు సదాజపుడి పేరూ, సంజీవిని సిద్ధుకు కాయడం చెప్పించారు.

సదాజపుడు – జపమాలని తిప్పుతూ ఉండేటప్పుడు – మొఖాన్ని కప్పుకోవడం కూడా కథకి చాలా అవసరం. సదాజపుడి దిరుసులు వేసుకొని అతడి గొంతుకని అనుకరించి, 'అంజి' ఆడిన నాటకంవల్ల మాంత్రికుడి మంత్రశక్తులకి మూలమైన గడ్డం – పోవడం కథ కంచికి వెళ్ళడం జరుగుతుంది. అంజి కూడా సదాజపుడిలాగ మొఖం కప్పుకోవడం వల్ల మాంత్రికుడు కూడా మోసపోగలిగాడు. అయితే సదాజపుడికన్నా అంజి పాత్ర ఆయువుపట్టు కదా అన్న మీమాంస రావచ్చు. కాని సదాజపుడే లేకపోతే, బలేరాముడివల్ల బలి వేయబడ్డ మాంత్రికుడు మళ్లీ బ్రతికేవాడు కాదు – సదాజపుడు లేకపోతే – హాయిగా, మాయాభవనంలో బలేరాముడూ అతనిప్రియురాలూ సుఖంగా బ్రదికేవారు.

పాతాళభైరవి చిత్రానికి ఈ పాత్ర యింత జీవం పొయ్యడం ఒక యెత్తూ – ఈ పాత్రని దర్శకుడూ, రచయితా గుర్తించడం మరొక యెత్తూ. ఇంతవరకూ వచ్చిన చిత్రాలలో ఉపపాత్రలని గౌరవించిన విధంలో ఇదే ఉత్తమమయినది.

కథాగమనానికి, అసలు ప్రభవానికి ఉపపాత్రలు ఎలా అవసరమో సమస్యకి అవతల ప్రక్కని చిత్రించడానికి కూడా ఉపపాత్ర అవసరం. ఈ విషయం, రెండు చిత్రాలలో విపులంగా కనబడుతుంది. ఒకటి సంసారంలో, రెండు దీక్షలో.

సంసారంలో – సీతారాం పాత్ర సమస్యని సమగ్రంగా చిత్రించడానికి వీలయింది. ఈ పాత్రవల్ల కథ ఏమాత్రం నడవదు. హాస్యం తగ్గవచ్చు. కాని ఈ పాత్ర లేకపోతే సమస్య సంపూర్ణంగానే ఉండిపోతుంది. సంసారాన్ని కథానాయకుడు ఆర్థిక కారణాలవల్లా మానసిక వ్యథలవల్ల పరిత్యజించుతాడు. సీతారాం, పూర్తిగా తన అసమర్థతవల్ల త్యజించి, బైరాగుల్లో కలసిపోతాడు. కథానాయకుడికున్న ఆర్థిక బాధలు ఇతడికి లేవు. పై పెచ్చు – యింటి పట్టున ఉండే, మహారాజులాగ బతకమని తల్లి శతపోరుతుంది. చివరికి ముండనం కూడా కావిస్తుంది. అయినా అతడు వెర్రిబాగులవాడు. భార్య అంటే అమితవ్యామోహం ఉన్నవాడు. తల్లి అత్తగారూ పరమ మూర్ఖులు. తమ పట్టుదలే తప్ప – యువకుల సౌఖ్యాన్ని పిసరంతా గమనించనివాళ్లు. అతనిభార్య కూడా ఖాతరులేని మనిషి. తల్లి పెంపకంలో – సాంఘిక బాధ్యతల పట్ల ఏమాత్రం లక్ష్యంలేనిది. ఉన్న యింట్లోనే దొంగతనం చేసి స్వలాభం చూసుకునే స్వార్థపరురాలు. అయినా అటువంటి భార్యకోసం – సంసారసుఖంకోసం అతడు చెయ్యరానివన్నీ చేస్తాడు. గాడిద బరువులు మోస్తాడు. బతికున్న వాళ్లుచచ్చిపోయినట్టు అబద్ధమాడుతాడు. అందుకు ఋజువుగా అరిసెలు కూడా తెస్తాడు. అయినా చివరకి అతడు సైతం వేగలేక, విసుగెత్తి "ఇందుకేకాబోలు మాబావ సంసారం వదిలిపెట్టి పోయాడు" అని గుర్తించి తానూ బైరాగుల్లో కలిసిపోతాడు. "జాగ్రతో జాగ్రత" అని హెచ్చరిస్తాడు. అయినా – ఇతడి సమస్యాపరిష్కారం – సులభం. నేను సలహా యివ్వగానే అతడు సన్యాసానికి విడాకులిచ్చి కొరడా చేత పట్టుకొని తల్లినీ, అత్తగారినీ, భార్యనీ అదుపాజ్ఞలలో పెట్టుకొంటాడు. తాళం చెవులు పుచ్చుకొని యింటికి యజమాని అవుతాడు.

మానసికదుర్బలత్వం చేత సంసారాన్ని విడనాడితే – అది పరిష్కరించడం సులభం అని దర్శకుడు సమస్యలో ఒక భాగాన్ని యిందువల్ల చాలా చక్కగా చిత్రించాడు. అందుకే సీతారాం సమస్య ముందుగానే పరిష్కారమైపోతుంది. ఇక కథానాయకుడి సమస్య, పూర్తిగా ఆర్థికమైనదే – అతడిలోనూ మానసిక దుర్బలత్వం ఉన్నది. దానిని ఆర్థిక దారిద్ర్యం అతి ప్రమాదకరంగా చేసింది. అందుకే అతడు ఒకంతట తిరిగి సంసారంలో యిముడలేకపోయాడు. విరక్తి – అనురక్తిగా మారడానికి కొంచెం వ్యవధి కావలసివచ్చింది. సీతారాం మట్టుకూ, మార్గోపదేశం అయినవెంటనే ఎగిరిగంతేసి అది ఆచరణలో పెట్టుకొని – సౌఖ్యజీవి అవుతాడు. సంతానవంతుడౌతాడు. పాలబుడ్డి పట్టుకొని భార్యవెంట తిరగడం – తల్లినీ అత్తగారినీ ఉరిమిచూడడం ఆ చిత్రంలో ఈ పాత్రకి ఆఖరి దృశ్యం. అందులోనే దర్శకుడు అసాధారణ ప్రజ్ఞ చూపాడు. వాస్తవానికి సీతారాం భార్యా వ్యామోహి. అది అతడి సైజం కనుకనే చివరి దృశ్యంలో కూడా అతడు



'సనం' హిందీచిత్రంలో మీనాకుమారి



'లావణ్య' తమిళ చిత్రంలో సూర్యప్రభ

భార్య వెనువెంట తిరుగుతాడు - గాని తన సౌఖ్యానికి అడ్డువచ్చే తగినీ అత్తగారినీ - మొదట అదుపాజ్ఞలలో పెట్టుకొనలేక అతను యిబ్బందిపడ్డాడు గాని చివరకి వారిని కనుగాపుతోనే కట్టిన క్రూర మృగాలలాగ చేయగలిగాడు. సీతారాం పాత్ర లేని "సంసారం" అసంపూర్ణ సమస్యగానే ఉండేది.

దీక్షలో దుర్గమ్మ పాత్ర యిటు కథా చలనానికి, అటు సమగ్రసమస్యా చిత్రణకీ తోడుపడ్డది. దీక్ష మాతృప్రేమకి సంబంధించిన కథ. కన్నతల్లి కాకపోయినా, పెంచిన మమకారం, వాత్సల్యం గల ఉత్తమ నాయిక - యింగులో ప్రధాన భూమిక, యశోద ఉత్తమ యిల్లాలు. చల్లని తల్లి. కల్లకపటం లేనిది. మూర్తీభవించిన మాతృమూర్తి. మరిదిని తన బిడ్డతో సమానంగా, కొన్ని వేళలలో తన బిడ్డకన్నా ఎక్కువగా చూసుకొంటుంది. ఇది ఉత్తమ విధానం. అయినా లోకంలో నిర్మలమైన మాతృప్రేమ కాకుండా పాశవికమైన, మూర్ఖమైన తల్లిప్రేమకూడా లేకపోలేదు. ఆ భాగంకూడా చూపెడితేనే గాని మాతృప్రేమ సమస్యగా తీసుకొన్న 'దీక్ష' చిత్రానికి పరిపూర్ణత లేదు. దుర్గమ్మ పాత్ర చిత్రానికి నిండుతనాన్ని యిచ్చింది.

('దీక్ష' శరత్ రచనకు అనుసరణ కావచ్చు గాని చిత్రకథను చిత్ర కథగానే పరిశీలించడం సమంజసం.)

దుర్గమ్మ ఆంధ్రదేశంలోని అసంఖ్యాకమైన తల్లులకి ప్రాతినిధ్యం వహిస్తుంది. అజ్ఞానంలో పుట్టి పెరిగిన తల్లుల తరిఫీదులో పెరిగిన యిల్లాళ్ళకి ఉదాహరణ. ఈమెకి కూడా కడుపుతీపి ఉంది. అయినా అది విపరీతం. తన కడుపునపుట్టినవాళ్లూ - ఆ సంతానం మట్టుకే లోకంలో సుఖించాలి. యితరు లెవరూ సుఖపడకూడదు. తన కడుపున పుట్టినవాళ్ళ సౌఖ్యంకోసం ఈమె ఎంతకైనా తెగించుతుంది. అయితే ఆ సౌఖ్యానికి ఈమె నిర్వచనమ్మట్టుకూ వేరు. వాస్తవానికి యశోదకి గోపీ సుఖపడడమే కావాలి. అయినా అది దుర్గమ్మకి కిట్టదు. తన మనవడికన్నా - అల్లుడి తమ్ముడు యింట్లో అన్ని విషయాలలో మొదట లెక్కకొస్తున్నాడన్నది ఆమె సహించలేదు. ఆమాట ఆమె మొదటే కూతురితో చెపుతుంది. కూతురు తనమాట లక్ష్యపెట్టలేదని తెలుసుకొని - తనే కత్తి కడుతుంది. గోపి పరాసికాని కన్న మాటలను పట్టుకొని పీక్కొంటుంది. పదేపదే - "నేను ఈనాటికి ఈ యింట్లో రాక్షసిని దెయ్యాన్ని అయినాను" అని ఏడుస్తున్నట్టు నటిస్తుంది. వాణ్ణి నానా బాధలూ పెట్టడానికి ప్రయత్నిస్తుంది. కూరలో భరించలేనంత కారం కలిపి వడ్డిస్తుంది. అలా తాను కలిపినట్టు తెలిసిపోయినా ఏమీ ఎరగనట్టు - "నీకో పాయ్యి, వాడికో పొయ్యి పెట్టి వండేరా?" అని సర్ది చెపుతుంది. వాడు ప్రాణాలకన్నా ఎక్కువగా చూసుకొంటున్న రామలక్ష్మణులను కోయిస్తుంది. ఇదంతా - తన కూతురి కొడుకు కన్నా యింకొకడు సుఖపడుతున్నాడనే!

దుర్గమ్మ ఎంత పట్టుదలగలమనిషో అంత మూర్ఖురాలు. ఈమెకి కూతురిమీద చెప్పలేనంత ప్రేమ. కూతురికి కొంచెం జ్వరమొచ్చింది. అని ఉత్తరం రాగానే రెక్కలు కట్టుకొని వచ్చి వాలుతుంది. కూతుర్ని కూర్చోపెట్టి - అన్ని పనులూ తనే చేస్తుంది. అయినా ఈమె ఒక విషయంలో తన స్వార్థాన్ని బైటపెడుతుంది. తనకు తగలవలసిన రాయి యశోదకి తగిలి గాయం అవుతుంది. "కొంచెంలో తప్పిపోయిందిగాని యింత దెబ్బా నాకు తగలవలసిందే కదా!" అని మాటిమాటికీ - ఏడుస్తుంది. ఇంత మూర్ఖం ఉండబట్టే తల్లి ప్రేమ ప్రదర్శించే ఘట్టాలలో కూడా



నవయుగ పిక్చర్స్ వారి సాంఘిక చిత్రం 'జ్యోతి' లో
జి. వరలక్ష్మి, పిల్లలకు పాఠం చెబుతున్నది.

ఈమె పశువుగా ప్రవర్తిస్తుంది. ఏ కూతురు సుఖపడాలని ఈమె అనుకొని పట్టుదలకి దిగిందో - ఆకూతుర్నే మరిచిపోయి పట్టుదలనే పట్టుకొని ఈమె సాగుతుంది. వేరులు పడ్డాక యశోద గోపికి అన్నం తీసుకు వెళుతూఉంటే ఈమె సహించలేకపోయింది. కూతుర్ని వారించింది. లాభం లేకపోయింది. తన శత్రువుకి తన కూతురు అన్నం పెడుతూఉంటే - ఆ పెట్టేది తన కూతురని ఆమె విస్మరించి - ఆమె మీద అల్లుడితో ఫిర్యాదు చేస్తుంది. అంత దాకా పోయింది. ఆమె తల్లిప్రేమ.

ఈ మనస్తత్వం - మాతృప్రేమ సమస్యలో అవతల భాగాన్ని బాగా తూకంలో ఉంచింది. ఇక దుర్గమ్మపాత్ర కథకి తోడ్పడడం కూడా యింత శ్లాఘనీయంగానూ ఉంది. దుర్గమ్మ వచ్చి ఆ కుటుంబంలో అగుసుపెట్టకుండా ఉంటే, గోపీ ధర్మకోప ప్రదర్శనాలు, విధ్వంసనోద్యమాలు సాగినన్నాళ్లు సాగి చల్లబడేవి. గాని ఈమె రాకవల్ల ఆ కుటుంబంలో ప్రశాంతత చచ్చి - వేరులు పడడందాకా పోయింది. ఈమె లేకపోతే కథ నడవదు.

ప్రధానపాత్రలకి అండగా నిలబడి కథని ఉపపాత్రలు నడిపిస్తే - అది హర్షించతగ్గట్టు ఉంటుంది. గాని కొన్ని చిత్రాలలో ప్రధాన పాత్రలను మింగేసి ఉపపాత్రలు కథని నడుపుతాయి. కథని నడపడమే ముఖ్యమైనప్పుడు ఇది సమర్థనీయమైనా, ప్రధానపాత్రల పరిపోషణలో లోపం వచ్చేటంత బాగా ఉన్ననాడు ఔచిత్యం భంగం అవుతుంది. "స్త్రీ సాహసం"లో రాణిపాత్ర, పేరుకి ఉపపాత్రగా ఉంచవలసినా, ప్రధాన భూమికకన్నా ఉన్నతమైనది. మనోహారి ఉత్తమక్షత్రియ కన్య. తాను వలచిన యువకుణ్ణి పతిగా నోచుకోనేందుకు అతడు విధించిన మూడు షరతులని పూర్తిచేయడానికి సవాలు చేస్తుంది. అయినా ఆ మూడు షరతులు ఆమెకి మారుగా రాణియే పూర్తిచేస్తుంది. ఒక్క పసరాకు తేవడంతప్ప మనోహారి షరతులు నిర్విఘ్నంగా సాగడానికి ఆట్టే పనికిరాలేదు. రాణీ తన మానాన్ని పోసి, మాణిక్యభవనం కట్టిస్తుంది. తన చాకచక్యాన్ని ప్రదర్శించి, కోమలిని దండయ్య చెరనుండి విడుదలచేసి, మూడో షరతు పూర్తవడానికి వీలుగా శత్రుప్రదేశానికి తీసుకొస్తుంది. ఇక ఎటొచ్చి షరతులో గర్భం దాల్చవలసినదీ మనోహారిగా విధించబడడంవల్ల ఊరుకొంది గాని లేకపోతే రెండో షరతు కూడా ఆమె పూర్తిచేసి పువ్వులో మనోహారికి అది సమర్పించేది. ఇంతకూ రెండో షరతు పూర్తవడానికి తగిన తతంగం అయిన గూఢారంలోకి పంపడం - దుస్తులు ఆనవాలుకి దాచడం మొదలైనవి అన్నీ రాణీయే చేసింది. ఇంత కథ ఉపపాత్రవల్ల నడవడం మంచిదేనా? దర్శకుడు, రచయిత ఆ పాత్రని ఉపపాత్ర కింద పరిగణించకపోయినా ప్రేక్షకులు పరిగణించుతారు. రాణి మనోహారికి ప్రాణం కావచ్చు. అయినా ఉత్తమక్షత్రియకాంతగా చిత్రించబడిన కథానాయిక చెయ్యవలసిన పనులన్నీ ఉపపాత్ర చెయ్యడం, సబబుగా ఉండదు. కథ పేరు 'స్త్రీసాహసం' అనడంకన్న మిత్రధర్మం అనే అర్థంవచ్చేది పెడితే రాణీ కథానాయిక అయి యిన్ని పనులు చేసినా సమంజసంగా ఉండేది. రాణీకూడా స్త్రీయే కనుక ఈమె చేసినది కూడా సాహసమే కనుక కథకి పేరు తగినది అని సమర్థించవచ్చు గాని - "స్త్రీ సాహసం" అనగానే ప్రేక్షకులు పేరులోని "స్త్రీ"ని కథానాయిక కింద జమ కడతారు.

పేరుకీ కథకీ సంబంధంలేని చిత్రాలు లేకపోలేదు. వాటి ప్రసక్తి లేదు. కథ బాగుండీ, పరిపోషణ చక్కగా ఉండీ - ఔచిత్యం తలవెంట్రుకవాసిలో భంగం అయినట్టు కనబడితే పాత్రల స్థానాన్ని నిర్ణయించడంలో విమర్శకుడు సానుభూతి ప్రదర్శించడానికి వీలు లేదు.

కథా రచనలో పటుత్వం, నిర్మాణంలో చాకచక్యం లేకపోబట్టి - కొన్ని చిత్రాలలో ప్రజ్వలించవలసిన ఉపపాత్రలు నివురుకప్పినట్టు నిర్జీవంగా కనిపిస్తాయి. కాని ఆ పాత్రలని అభినయించిన నటీనటులు తమ ప్రతిభవల్ల కొద్దిగా ప్రాణం పోయడం కద్దు. నిర్దోషిలో చంద్రయ్య, మాయలమారిలో పురవంజి యిందుకు ఉదాహరణలు. నిర్మల బ్రతుకు కడగండ్లపాలవడానికి చంద్రయ్య మంచిసాధనం. ఇందుమతి కష్టాలుగట్టెక్కడానికి పురవంజి సహాయం అత్యవసరం. ఈ రెండు చిత్రాలూ తక్కిన హంశాలలో రాణించినట్టయితే ఈ పాత్రలు ఆ చిత్రాలకి మెరుగు పెట్టేవి.

ఉపపాత్రలు చిత్రానికి ప్రాణం పోసినట్టే - ప్రాణాన్ని కూడా తియ్యగలవు. విజయవంతంకాని చిత్రాలలో చాలావరకు ఈ వ్యాస రచయిత వీక్షించలేదు కాబట్టి ఉదాహరణలు చూపడానికి ఆస్కారం లేదు. చిత్రం దెబ్బతినడానికి పూర్తిగా కారణభూతం కాకపోయినా, అనవసరంగా, ఇటు కథకూ అటు సమస్యకూ సంబంధంలేని పాత్రలు మన చిత్రాలలో తరచుగా కాకపోయినా అరుదుగా ఈ సంవత్సరం కనబడ్డాయి. పేరంటాలులో మాలతి వేసిన పాత్ర (పాత్రపేరు గుర్తులేదు) ఆ చిత్రానికి ఏ విధంగానూ అవసరంలేదు. రెండు మూడు దృశ్యాలలో నాలుగైదు సంభాషణలు కొనిచ్చి, ఒక పాట పాడడం తప్ప యీ పాత్ర చేసినపని వేరేలేదు. ఒక వేళ కుటుంబయ్య వేరే పెళ్లి చేసుగోదలచిననాడు కావలసిన యింకో అమ్మాయిగా ఈ పాత్ర అవసరం అని రచయితా దర్శకుడూ (ఇద్దరూ ఒకరే) భావించినా అది చిత్రంలో ఫలించలేదు. ఈ మాత్రం బాదరాయణ సంబంధం ఉంది కనుకే ఈ పాత్ర చిత్రంప్రాణం తీసింది అని చెప్పలేకపోతున్నాం. చిత్రానికి గాయం మట్టుకూ చేసింది అని చెప్పవచ్చు.

సౌదామిని చిత్రంలో రెండు ఉపపాత్రలు ఒక సమస్యని అద్భుతంగా చిత్రించగల అవకాశాలు ఉన్నయి గాని దర్శకుడూ రచయితా కొద్దిగా చిన్నచూపు చూడడంవలన ఆ విషయం చిత్రంలో రాణించడం మాట అటుంచి, స్ఫుటంగా ద్యోతకమవలేదు. బోధాయనుడూ, కాలభైరవుడు యిద్దరూ మంత్రసిద్ధులు. అయినా అందులో మొదటివాడు తన మంత్రశక్తులను - లోకకల్యాణం కొరకు వినియోగిస్తాడు. రెండోవాడు స్వార్థంకొరకూ, కామతృప్తికీ వాడుకొంటాడు. యిద్దరూ కథకి కావలసినవారే. వీరిలో ఒకరి మంచినీ, రెండోవారి చెడ్డనీ తూకం వేసినట్టు దర్శకుడు ప్రదర్శించడానికి అవకాశం కల్పించిఉంటే బాగుండేది.

మొత్తంమీద ఈ ఏడు విడుదలయిన రెండు డజన్ల చిత్రాలలో కొద్దిపాటి చిత్రాలలోనయినా - ఉపపాత్రల చిత్రణ చక్కగా ఉన్నందుకు ఆయా రచయితలు, దర్శకులు ప్రశంసనీయులు. చిత్రవిజయానికి కథ ఆయువుపట్టు అని ప్రగాఢంగా తెలివిడి కావడంవల్ల యికమీదటి చిత్రాలలో ఉపపాత్రల పరిపోషణలో నిండుతనం కనబడే అవకాశాలు ఉండవచ్చు అన్న ఆశాభావం మొలకెత్తడం ముదావహం.



# కాంచన ద్వీపం

(౩౨-వ పేజీ తరువాయి)

ఒకళ్లని పేల్చేయటం, సముద్రంలోకి తోసెయ్యటం."

"పాపం చంపట మెందుకురా, సిల్వర్ ?" అన్నాడొకడు.

"ఏం చెయ్య మంటావ్? తస్సదియ్యా, బయల్దే రాడోయ్ ఏస్క్రీస్తు. అక్కడ ఆ లంకలోనే వదిలేద్దా మంటావా? ఫ్లింట్ గాని, బిల్లీబోన్స్ గాని అయితే అల్లాగే చేసేవారు. కాని నేను పెద్దమనిషిని. నాకూ దయా, ధర్మం, నీతిజాతీ వున్నాయి. అంచేత నన్నడిగితే వాళ్లని చంపెయ్య మంటాను. వాళ్లు లంకలోనుంచి ఎల్లాగో బయటపడితే మన పనేమవుతుంది? నేను గుర్రాల కోచ్‌లో దర్జాగా కూర్చుని పార్లమెంటుకు పోతూ వుండగా ఈ జమీందారు, ఈ డాక్టరు, మళ్ళీ నాకంట పడటం, నన్ను కోర్టుకు లాక్కెళ్లటం, నా మెడకి ఉరితాడు చుట్టుకోవటం—ఈగోలంతా నేను పడలేను. అంచేత ధన్ ధన్ పేల్చడమే పద్ధతి."

"సిల్వర్! నువ్వురా మొగాడివంటే," అని ఒకడు ఎంతో మెచ్చుకుంటున్నట్టు అన్నాడు.

"చూద్దువుగానిగా, సమయం వచ్చినప్పుడు, తస్సదియ్య. నే నొక్కటే కోరుతున్నాను. ట్రెలానీ గాణ్ణి నా కిచ్చెయ్యండి. వాణ్ణి చంపాలని ఎన్నాళ్లనించో ముచ్చట పడుతున్నాను. ఇస్రాయెల్! కెప్టెన్ స్మాలెట్‌ని కావలిస్తే నువ్వు తీసుకో. ఏం? అరే అబ్బి, డిక్! అదుగో ఆ పీపాలో ఆపిల్ పండేమన్నా వుంటే ఒకటి పట్రా. నాలిక దురదగా వుంది."

ఈ మాట వినేసరికి నాకు ఊహాతీతమైన భయం పుట్టింది. మనుషుల్లో ఇంత క్రూరు లుంటారని నేను ఎప్పుడూ ఊహించ లేదు. సిల్వర్ "ఆపిల్ పండు తీసుకుర"మ్మనగానే నా పని అయిపోయిం దనుకున్నాను. డిక్ కూర్చున్నచోటనుండి లేవడం వినిపించింది. కాని నా అదృష్టం బాగుండటంవల్ల ఇస్రాయెల్ వాణ్ణి ఆపాడు.

"సిల్వర్! ఇప్పుడా చెత్తంతా ఎందుకు లెద్దూ? కాస్త రమ్ తెప్పించు, తాగుదాం," అన్నాడు ఇస్రాయెల్.

"డిక్! ఇదిగో తాళం చెవులు. పోయి రమ్ తీసుకురా," అన్నాడు సిల్వర్.

అప్పుడు నా కర్థమైంది, చచ్చిపోయిన తండేలుకు రమ్ ఎక్కణ్ణించి వచ్చేదో. బహుశా సిల్వరే మిస్టర్ యారోను వదిలించుకోవాలనే ఉద్దేశంతో అతనికి రమ్ అందించి వుంటాడు.

డిక్ అవతలికి వెళ్లగానే ఇస్రాయెల్ సిల్వర్‌నేదో మెల్లిగా అడిగాడు. సిల్వర్ ఏదో సమాధాన మిచ్చాడు. ఒకటి రెండు ముక్కలు మాత్రం స్పష్టంగా వినిపించాయి. "ఉహు, ఇంకెవ్వరూ మనతో చేరరు," అని సిల్వర్ అన్నాడు. దాన్నిబట్టి ఓడమీద కొందరైనా మేము నమ్మదగిన మనుషు లున్నారని గ్రహించాను. డిక్ రమ్ పాత్రలు తీసుకుని తిరిగి రాగానే అంతా తాగారు.

ఇంతలో సరంబీమీదనుండి కేకలు వినిపించాయి. "ఎహేయ్, నేల అదుగో, నేల" అని ఎవడో అరుస్తున్నాడు. వెంటనే ఆపిల్ పీపావద్ద సమావేశమంతా చెల్లాచెదరైంది. దడదడ కాళ్లు తొక్కుకుంటూ అంతా సరంబీమీదకు పరుగెత్తారు. నేను "అమ్మయ్య" అని నిట్టూర్పు విడిచి పీపాలోనుండి బయటికి దూకాను.

(ఇంకా వుంది.)

# 'నా మొదటినవల'

(36-వ పేజీ తరువాయి)

ముగిశాయి. భోజనాలు, ప్రసాదాలు ముగించుకుని సరంజామా తీసుకుని చెరువు గట్టు చేరుకున్నాము. చేరుకుంటూనే జట్లు జట్లుగా ఏర్పడి తూటాలు, జువ్వలు కాల్చడం ప్రారంభించాము. మా జట్టుకి నేను నాయకుణ్ణి. అందుకని మా అస్త్రాలన్నీ నా వద్దనే ఉన్నాయి.

అయితే ఆపడాది మా ఏర్పాట్లన్నీ అనుకోని విధంగా తలక్రిందులైనాయి. అదే చెరువుగట్టుమీద రూరల్ డిస్పెన్సరీ ఉంది. డాక్టరుగారు కోపిష్ఠి. తొందరపాటు ఎక్కువ. అసలే కోతి...వంటివాడు కొత్తగా పెళ్ళయింది. డిస్పెన్సరీ ముందుగదిలో పెట్రోమాక్సులైటు పెట్టుకుని భార్యతో కారమ్సు ఆడుతున్నాడు. డిస్పెన్సరీ గుమ్మం బార్లా తీసిఉంది. ఆయన నివాసం కూడా డిస్పెన్సరీలోనే.

నేను వేసిన తూటా ఒకటి ఎలా వెళ్ళిందో సావిట్లో ప్రవేశించి, డాక్టరుగారి బుర్రచుట్టూ ప్రదక్షిణం చేసి, ఝుయ్యిమని ఆయనభార్య చీర చెరగులో దూరింది. వెంటనే దాని భరతం పట్టారు. ఆయన ప్రళయరుద్రుడై పోయాడు. భార్యచేత కాల్పించడానికి ఊళ్ళో దుకాణంలో కొన్న అరడజను చిచ్చుబుడ్లలో ఒకటితీసి, అది వెలిగించి, నామీద దాడిచేశాడు. అంతవరకు డాక్టరుగారింట్లో తమాషా చూస్తున్న నేను ఆయన కేకలువిని, నిలబడితే మర్యాద దక్కదని పరుగు ప్రారంభించాను. ఆయన ఇక నన్ను తరిమి పట్టుకోలేక ఆ వెలుగుతున్న చిచ్చుబుడ్డి విసిరి కొట్టాడు. అది నా వీపుమీద బద్దలైంది. వీపు అక్కడా అక్కడా కాలింది. నేను మరెక్కడా ఆగకుండా ఇల్లు చేరుకున్నాను.

నేను పారిపోవడంతో నా జట్టు ఓడిపోయింది. నా దగ్గరఉన్న తూటాలు జువ్వలు ఆ చీకటిలో కిందపడిపోయాయి. వాటిని ఎవరో చేజిక్కించుకుని హాయిగా కాల్చుకున్నారు

మానసరదా అంతా మంటగలిపిన ఆ డాక్టరుమీద ఎలాగైనా పగ తీర్చుకోడానికి ఆలోచించాను. వీపు కాల్చినందుకైనా తగిన శిక్ష విధించాలనే నిశ్చయానికి వచ్చాను. చాలా ఉపాయాలే తట్టాయి. వాటిలో ఒకటి. మా పాలేరుకి నాలుగణాలిచ్చి డాక్టర్ని కొట్టించడము. కాని అవేవీ నాకు రుచించలేదు. ఇతరుల ద్వారా పగదీర్చుకోవడం చేతకానితనం అనిపించుకుంటుంది. దానివల్ల సంతోషమేమీ కలుగదు. డాక్టర్ని స్వయంగాకొట్టి తిట్టడానికి తగినంత బలం లేదాయె. ఇతర విధాలుగా ఆయనమీద పగతీర్చుకుంటే ఊళ్ళోవాళ్ళు మా వాళ్ళు కూడా నన్ను బతకనివ్వరు. ఊళ్ళో అందరికి ఆయనే వైద్యుడు. అప్పుడు తట్టింది నవల వ్రాద్దామని. ఇంత మహాకోపం తీర్చుకోడానికి ఓకథో గిథో అయితే ఏం సరిపోతుంది?

అనుకోడమేమిటి, వ్రాసెయ్యడమేమిటి? ఆనవలలో కథానాయకురాలు ప్రేమలత అనే అమాయక బాలిక. పరమ సౌందర్యఖని. కథానాయకురాల్ని హింసించి, తనవల్లో వేసుకుని పెళ్ళి చేసుకోడానికి ప్రయత్నించిన దుర్మార్గుడు డాక్టర్ ఘోష్ (డాక్టరు అసలు పేరు పనికిరాదని బెంగాలీ పేరు పెట్టాను. అది బెంగాలీ డిటెక్టివ్ కథలో ఒక హంతకుడి పేరు) ప్రపంచంలో ఉన్న దుర్మార్గపు లక్షణాలన్నీ ఆ డాక్టరుకి కట్టబెట్టాను. డాక్టరు వలలోంచి ఆ బాలికని రక్షించి, వివాహం చేసుకున్నది నేను. ఆవిధంగా డాక్టర్ని భంగపరిచి, పగ తీర్చుకున్నాను.

ఈకథకి తలవని తలంపుగా మరొక రకమైన పరిణామం సంభవించింది. ఆ తరువాత తరువాత మా ఊళ్ళో డాక్టరికి నాకు స్నేహం కలిసింది. ఆ తరువాత అతను ఎంతో మంచివాడయ్యాడు. అందుచేత ఆనవల అచ్చు వేయించడం స్నేహితుడికి అపచారం చేసినట్లవుతుందని దాన్ని చింపి పారేశాను. అదిగో ఆవిధంగా నేను సాహిత్య ప్రపంచంలో అడుగు పెట్టడానికి ఒక రకంగా దీపావళి కారణమైంది.



# జీవనభారం

(22-వ పేజీ తరువాయి)

సంచుకుంటే యింత కష్టంగా వుండేది కాదు. కాని అది అహార్యం.

రామగోపాలం దినదిన ప్రవర్థమానమౌతున్న కుటుంబబాధ్యతలు, అవసరాలు చూస్తూ వూహిస్తూ బెంగపెట్టుకున్నాడో, అసహ్యించుకున్నాడో, కోపగించి ఎదురొడ్డి దలిచేడో ఏ మహా కార్యాంతరంలో లీనమయేడో కాని అకస్మాత్ గా అంతర్హితుడై జాడ తెలియని ఏ ప్రదేశానికో చేరుకున్నాడు—

రెండేళ్ళుగా పీడించుకు తింటూ వచ్చిన భార్య ఏడుస్తూ మొత్తుకుంటూ, శాపనార్థాలు పెడుతూ పుట్టింటి దారి పట్టింది. తమ్ముడు వారాలకు కుదిరి ఎలాగో చదువుకో సాగాడు. విధవ అక్క స్వగ్రామం చేరుకుంది. యిందరూ వెళ్ళిన సంగతి సందర్భాలు అందరూ ఎరుగుదురు. రామగోపాలం మాత్రం ఎందుకు ఎక్కడికి ఇలా నిర్హేతుకంగా వెళ్ళిపోయింది ఎవరికీ సరిగా బోధపడలేదు. తలోవిధంగా భావన చేసికొని సమాధానపడ్డారు. అంతే—

ఏడాది తరువాత రామగోపాలం చదువుకుండే రోజుల మిత్రురాల్ని మళ్ళా కలుసుకొని ఆమె యింట్లో బైరాయించేసే సంగతి బయటపడింది.

త్రైదశవర్షవయస్విని, విగతభర్తృకయైన విశాలాక్షి, సతీపరిత్యాగియైన పంచవింశద్వర్షవయస్కుడైన రామగోపాలానికి ఆశ్రయమిచ్చింది. కడుపునిండా తిండి చక్కని బట్ట, చదువుకు సేందుకు కావలసిన పుస్తకాలు, వినోదకాలక్షేపానికైన ధనం యిస్తూ, ఇల్లుయిల్లాలు అన్నీ తనే తగిన వుపచారాలు చేస్తూ తనింట వుంచుకుంది.

లోకం అతన్ని గుర్తించి పోషించగ అయితే తెలిసినవాడు, యింతో అంతో ప్రయోజకుడనదగిన రామగోపాలం ఎందుకిలా చేసేడు?

మనిషికి కావలసిన డబ్బు, చదువు, తిండి, బట్ట యిల్లు యిల్లాలు వీటికోసం రామగోపాలం పాటుపడ్డాడు. అయితే యీ అవసరాలు పొందగలగటం బహు తమాషా.

డబ్బుంటే మిగిలినవన్నీ వస్తాయి. చదువుంటే డబ్బు గడించవచ్చు. డబ్బుంటే తిండి బట్ట వస్తాయి. ఆ రెండూ వుంటే యిల్లు కుదురుతుంది. ఇల్లు జోతపడితే యిల్లాలి అవసరం కలుగుతుంది. యివన్నీ సంప్రాప్తమయేయి అనేసరికి డబ్బు గొక్కటమవుతుంది. డబ్బుకి యిబ్బందిరాగానే తిండి బట్టల్లో లోపం యేర్పడుతుంది. అప్పుడు యిల్లు యిల్లాలు చిన్నబోతాయి. అవి చిన్నబోతే వాటి యజమాని తిరస్కృతుడౌతాడు. యివన్నీ లభించడంకోసం చేసిన యత్నమంతా భంగపాటు చెందటం ప్రారంభిస్తుంది. ఆ జీవనభారానికి అంతూ పొంతూ వుండదు. రోజూ భారమే—మళ్ళా తేలిక చేసుకోవడం—మళ్ళా భారం—యిలా నిర్విరామమయిన యాతనల్లో జీవనం కృంగి కృశిస్తూంటుంది.

అయితే రామగోపాలం ఆఖరికి విశాలాక్షి దగ్గరకు పారిపోవలసి వచ్చింది. అతడు జీవితాన్ని యిష్టపడ్డాడు. అలగు మంచి ఆశయాలు కలవాడే ననుకోండి. గౌరవనీయుడు, సహృదయుడే అని తలవండి. అట్లాంటి వ్యక్తి విశాలాక్షి పాదదగ్గర చారణ చక్రవర్తి అవవలసివచ్చిందెందుకో అని అతిగా ఆలోచించనక్కరలేదు. అతని జీవితవైఖరికథనం మొదటినుంచి పరిశీలిస్తే బోధపడుతుంది.

జీవనభారానికి వెరచి తట్టుకోలేక తికమకలుపడేవారు యీ అనంత భువలయంలో కోటానుకోట్లున్నారు. వారందరూ యిలాగే అయిపోతున్నారా అంటే నే జవాబివ్వలేను. కొందరేనా యిలా అవుతున్నారని నేను ఘంటాపథంగా చెప్పన్నది మీరు కాదనలేరు. మీరూ నేను కూడా యింతే. ఎప్పుడేనా లొంగిపోవలసి రాకూడదా? అయితే అందుకు మనం బహుముఖయాతనల్లోపడి ముమ్మరంగా నలిగిపోతున్నా, సహనంతో జీవితాంతమూ శ్రమించవచ్చు—అటువంటప్పుడు మనం రామగోపాలంకంటే అట్టే గొప్పవాళ్ళమని మాత్రం విఱ్ఱవీగతేం—మనం తలలు వంచుకుంటాం జీవనభారంతో—కాని అతనిలా బెంగపెట్టుకొని పారిపోము. మనం మనుష్యులం. అతన్ని బహుశా పతనమయిన మనుష్యుడనాలేమో? అందుకు కారణం మనకూ తనకూ సంబంధించిన జీవనభారమే—

# కౌంట్ ఆఫ్ మాంటీ క్రిస్టో

## అలెగ్జాండర్ ధ్యూమా

## 69

వృద్ధు లిద్దరికీ అంత్యక్రియలు జరిపి ఇంటికి తిరిగి రావడంతోనే విల్ ఫర్ట్ ఫ్రాంజ్ తో వివాహ ప్రసక్తి తెచ్చాడు. "ఫ్రాంజ్! మీరు మా అత్తగారి తుది కోరిక విన్నారుకదా! వాలంటిన్ వివాహం ఇంకెంత మాత్రం జాప్యం చెయ్యకూడదని ఆమె చెప్పి పోయింది."

"కాని ఇంత దుఃఖంలో మునిగి ఉన్న వాలంటిన్ పాపం..."

"ఆ తుది కోరికను చెల్లించడంకంటె వాలంటిన్ కి మరొక ముఖ్య కర్తవ్యం ఏ ముంది? ఆమె అభ్యంతరం ఏమీ ఉండదు."

"అయితే, నాకూ అభ్యంతరం లేదు. మీరు అవసరమైన ఏర్పాట్లు చేయండి."

"ఏర్పాట్లు ఇది వరకే జరిగిపోయాయి. ఇవాళే కంట్రాక్టు పైన సంతకాలు పెట్టవచ్చు. సెంట్ మిరాన్ దంపతుల ఆస్తి అంతా వాలంటిన్ కి ఇవాళనుంచే సంక్రమిస్తుంది. వివాహానికి పెద్ద ఆడంబరం అవసరంలేదని నా ఉద్దేశం."

"అదే నా ఉద్దేశం కూడా" అన్నాడు ఫ్రాంజ్.

"అయితే మీరిక్కడే ఉండండి. అరగంటలో న్యాయవాదిని పిలిపిస్తాను. గంటలో సంతకాలు చేసెయ్య వచ్చును. సాయంకాలం వాలంటిన్ తన ఆస్తి వివరాలు చూసుకుంటుంది."

"నా మిత్రులు ఆల్బర్ట్ కీ, చాతో—రీనాకీ కూడా కబురు పంపండి. నా పక్షాన వారిద్దరూ సాక్షులుగా ఉంటారు."

"క్షణంలో వారిని పిలిపిస్తాను. మీరిక్కడే ఉండండి." అంటూ విల్ ఫర్ట్ లేచి లోనికి వెళ్లాడు. వెంటనే వాలంటిన్ కి కబురు పంపాడు.

వార్త వినే సరికి వాలంటిన్ నిశ్చేష్టురాలయింది. గబ గబ తాతగారి గది వంకకు పరుగు తీసింది. కాని ఇంతలోనే విల్ ఫర్ట్ ఆమెను సమీపించి సావడిలోకి నడిపించుకు వెళ్లాడు. ఫ్రాంజ్ లేచి ఆమెకు అభివాదం చేశాడు.

అరగంటలో న్యాయవాది, సాక్షులు వచ్చారు. నయర్ టైర్ తన చరాస్తిని వాలంటిన్ కిగాని మరెవ్వరికిగాని ఇవ్వకుండా దానం చెయ్యడానికి మరణ శాసనం వ్రాసి ఉంచినట్లు ఫ్రాంజ్ కి తెలియపరచబడింది. విల్ ఫర్ట్ ఇలా చెప్పాడు. "కాని దీనివల్ల మీరు చింతించ నవసరం లేదు. మీపట్ల నా తండ్రి గారు విముఖులని సంకోచించ నవసరం లేదు. అసలు వాలంటిన్ వివాహంచేసుకోడమే ఆయన కిష్టం లేదు."

విల్ ఫర్ట్ మాటలింకా ముగియకముందే వెనుక తలుపు తెరుచుకుంది. బారోయ్ లోపలికి వచ్చాడు. వచ్చి అందరి వంకా ఒక సారి చూశాడు. ఫ్రాంజ్ వంక తిరిగి "నయర్ టైర్ తమతో వెంటనే మాట్లాడాలట. పిలుస్తున్నారు." అన్నాడు.

విల్ ఫర్ట్ ఉలిక్కిపడ్డాడు. హీలాయ్ విల్ ఫర్ట్ తెల్లబోయింది. "ఇప్పుడెల్లాగ? వీల్లేదని చెప్పు" అన్నాడు విల్ ఫర్ట్ తడబడుతూ. ఫ్రాంజ్ ఆశ్చర్యపడ్డాడు. బారోయ్ పరిచారకుడే అయినప్పటికీ యజమానుల్ని లక్ష్యపెట్టకుండా తిరిగి ఫ్రాంజ్ తో అన్నాడు. "ఇప్పుడే మిమ్మల్ని రమ్మని అంటున్నారు. తరవాత కాదు."

విల్ ఫర్ట్ వాలంటిన్ వంక తిరిగి "నువ్వు వెళ్లి చూడమ్మా! ఆయన కిప్పుడు అంత అవసరం ఏమి వచ్చిందో కనుక్కో." వాలంటిన్ లేచి వెళ్లబోతుండగా విల్ ఫర్ట్ "ఆగు" అన్నాడు ఆగు. నేనే వెళ్లి కనుక్కుంటాను.

"ఉండండి" అన్నాడు ఫ్రాంజ్. "నయర్ టైర్ నాకే కబురు పంపారు. నే వెళ్లి ఆయన్ని దర్శిస్తాను. నాపట్ల ఆయనకు విముఖత పోగొట్టడానికి ఇంతకంటె మంచి అదను మరొకటుండదు

ఫ్రాంజ్ లేచి వాలంటిన్ ని అనుసరించాడు. వారిద్దరి వెనకా విల్ ఫర్ట్ వెళ్లాడు.

ముగ్గురూ నయర్ టైర్ గది ప్రవేశించగానే బారోయ్ వెనకనే తలుపు మూసి గడియ వేశాడు. నయర్ టైర్ ఒడిలో కాగితాల కట్టొకటి ఉంది. విల్ ఫర్ట్ తండ్రిని సమీపించి ఇలా అన్నాడు.

"ఫ్రాంజ్ తో మీరుమాట్లాడాలన్నారట. ఇదుగో ఫ్రాంజ్ వచ్చారు. ఇప్పుడైనా ఈ సంబంధానికి మీరు సమ్మతిస్తారనుకుంటాను."

తండ్రి కన్నులలో రోషం చూసే సరికి విల్ ఫర్ట్ కి వొణుకు పుట్టింది వృద్ధుడు వాలంటిన్ ను దగ్గరికి రమ్మని సంజ్ఞ చేశాడు. ఆమె సమీపించగానే పత్రాల వంక చూపాడు. వాలంటిన్ పత్రాలు తీసుకుంది. తరవాత వృద్ధుడు ఫ్రాంజ్ వంక చూశాడు. వాలంటిన్ పత్రాల నతనికిచ్చింది. "మీరిది చదవాలని మా తాత గారి ఉద్దేశం" అంది వాలంటిన్.

ఫ్రాంజ్ కట్టువిప్పి చూశాడు. "పైకి చదవండి" అంది వాలంటిన్.

"1815 ఫిబ్రవరి 5" అని చదివాడు ఫ్రాంజ్. ఒక్క క్షణం ఆలోచించి, వృద్ధుని వైపు తిరిగి నా తండ్రి హత్య చెయ్యబడిన రోజు" అన్నాడు.

ఆ నాటి బోన పార్టిస్ట్ క్లబ్ కి చెందిన ముఖ్య నాయకులు ముగ్గురు కలిసి వ్రాసిన పత్రం అది. ఫ్రాంజ్ తండ్రి అయిన జనరల్ క్విస్నెల్ హత్యకు సంబంధించిన వృత్తాంతం అందులో వివరించబడింది.

అప్పటికి నెపోలియన్ చక్రవర్తి ఎల్బా ద్వీపంలో ఖైదీగా ఉన్నాడు. అక్కడనుంచి తప్పించుకుని తిరిగి ఫ్రాన్స్ సింహాసనాన్ని ఆక్రమించుకోవాలని ప్రయత్నిస్తున్నాడు. చక్రవర్తి పక్షాన పారిస్ నగరంలో బోన పార్టిస్ట్ క్లబ్ ఒకటి తీవ్ర కృషి చేస్తోంది. ఆ కాలంలో ఒకనాడు, అనగా 1815 ఫిబ్రవరి 4 వ తేదీని, ఎల్బా ద్వీపం నుంచి బోన పార్టిస్ట్ క్లబ్ కి ఒక లేఖ వచ్చింది. ఫ్రాన్స్ రాజు లూయీ పక్షానికి చెందిన జనరల్ క్విస్నెల్ రాజు నెదిరించి నెపోలియన్ పక్షాన చేరుతున్నాడని లేఖలో తెలియపరచబడింది. క్విస్నెల్ ను విశ్వసించి క్లబ్ లో చేర్చుకో

అనువాదం: సీతారామ్

వలసిందని బోనపార్టిస్టులకు ఆ లేఖలో ఆదేశ మివ్వబడింది. ఆ రోజే సాయంకాలం క్విస్నెల్‌ను క్లబ్ అధ్యక్షుడు ఆహ్వానించాడు. క్విస్నెల్ సమ్మతించాడు. చీకటి పడిన తరవాత ఒక బగ్గీ వచ్చి క్విస్నెల్ ఇంటి ముందు ఆగింది. క్విస్నెల్ బగ్గీ ఎక్కి కూర్చున్నాడు. బగ్గీ కొంత దూరం వెళ్ళిన తరవాత ఆగింది. ఒక వ్యక్తి వచ్చి బగ్గీలో ఎక్కాడు. క్లబ్‌లో చేరదలుచుకున్నవాడైతే క్విస్నెల్ కొన్ని కట్టుబాట్లకు లొంగవలసి ఉంటుందని ఆ వ్యక్తి తెలియపరిచాడు. క్విస్నెల్ సమ్మతించాడు. వెంటనే నూతన వ్యక్తి రుమాలు తీసి క్విస్నెల్ కళ్ళకు గంత కట్టాడు. బగ్గీ సాగిపోయింది.

క్లబ్ లోనికి ప్రవేశించగానే క్విస్నెల్‌ను చేయిపట్టుకుని నడిపించుకుని వచ్చిన వ్యక్తి రుమాలు తీసివేశాడు. తన మిత్రులని భావించినవారనేకమంది క్లబ్‌లో కనపడే సరికి క్విస్నెల్ నిశ్చేష్టుడైనాడు. క్విస్నెల్ రాకతో క్లబ్ కార్యకర్తలు చర్చను ఆపివేశారు.

"ఇదేమిటి? మహారాజుపైన కుట్రపన్నుతున్న వారుమీరా?" అన్నాడు క్విస్నెల్ నిశ్చేష్టుడై.

క్లబ్ అధ్యక్షుడు, కార్యకర్తలు ముఖముఖాలు చూసుకున్నారు. చివరికి అధ్యక్షుడిలా అన్నాడు. "అవును. మేమే. మీరు మాతో చేరగోరుతున్నారని ఎల్బానుంచి మాకు కబురు వచ్చింది. ఇదిగో లేఖ. నెపోలియన్ చక్రవర్తి ఎల్బానుంచి బయలుదేరి రావడానికి ఏర్పాట్లన్నీ పూర్తయినాయి. ఆ వివరాలన్నీ తెలుపుతూ ఫరావోనౌక కెప్టెన్ ద్వారా మరొక లేఖ పంపుతున్నారనికూడా ఇందులో వ్రాసి ఉంది. మీకివేవీ తెలియవా?"

"నాకు తెలియవు. నేను రాజభక్తుడను."

"అయితే ఈ లేఖలో వ్రాసినది పొరపాటన్న మాట. మిమ్మల్ని గురించి ఎల్బా ద్వీపంలో ఎవరో మోస పడ్డారు." అన్నాడు అధ్యక్షుడు.

"కావచ్చును. కాని నాకు మోసాలతోనూ, కుట్రలతోనూ పనిలేదు."

క్లబ్‌లో గుసగుసలు బయలుదేరాయి. కొంతసేపైన తరవాత అధ్యక్షుడు క్విస్నెల్‌ను సమీపించాడు: "ఎవరి దోషం వల్లనో మా రహస్యం మీకు తెలిసి పోయింది. మీరు రాజభక్తి పరులు. మిమ్మల్ని రాజద్రోహం చెయ్యమని నిర్బంధ పెట్టం. కానిమారహస్యాన్ని కాపాడాలని మాత్రం కోరుతున్నాం. అందుకుమీరు ప్రతిజ్ఞ తీసుకోవాలి. నిరాకరించే పక్షంలో—మీకు తెలుసుకదా—మిమ్మల్ని బ్రతక నివ్వడం మా ఉద్యమానికిముప్పు."

"నేను రాజభక్తిపరుడనే. మీతో చేరి రాజద్రోహం చెయ్యలేను. అంతే కాదు. మీ రహస్యాన్ని కాపాడగలనని ప్రతిజ్ఞ తీసుకుంటే అది కూడా నా దృష్టిలో రాజద్రోహంకిందికే వస్తుంది."

"అయితే మా కర్తవ్యాన్ని నిర్వర్తించాలి."

"అంటే?"

"అంటే మీకు తెలుసును, రండి" అన్నాడు అధ్యక్షుడు.

క్విస్నెల్ చెయ్యి కత్తిపైన పడింది. వెంటనే కార్యకర్తలందరూ కత్తులు దూసి నిలిచారు. క్విస్నెల్ ఇంతమంది శత్రువుల మధ్య నిస్సహాయుడై నిగ్రహించాడు. తిరిగి అతని కన్నులకు గంతలు కట్టబడినాయి.

తెల్లవారుజామున, అనగా ఫిబ్రవరి 5వ తేదీని నదీ తీరంవద్ద ద్వంద్వ యుద్ధం జరిగింది. అందులో క్విస్నెల్ హతుడైనాడు. అధ్యక్షునికి ప్రక్కలో ఒక గాయమూ ఎడమ చేతిపైన రెండు గాయాలూ తగిలాయి. మరునాటి ఉదయానికి క్విస్నెల్ మృతదేహం నదిలో తేలింది. క్విస్నెల్‌ను హత్యచేసినట్లు ఎవరిపైనైనా అభియోగం తేబడినట్లయితే, అది హత్యకాదనీ, ద్వంద్వ యుద్ధ ఫలితమేననీ నిరూపించడానికి క్లబ్ కార్యకర్తలు ముగ్గురు ఈ పత్రాన్ని వ్రాసి సంతకాలు చేశారు.

ఈ వివరాలనన్నిటినీ చదివి ఫ్రాంజ్ విభ్రాంతుడై విల్‌ఫర్ట్ వంక చూశాడు. విల్‌ఫర్ట్ ముఖమెత్తలేక పోయాడు. వృద్ధుని వంక తిరిగి ఫ్రాంజ్ ఇలా అన్నాడు. "మీకీ సమాచారమంతా పూర్తిగా తెలుసుననుకుంటాను. నా తండ్రిని చంపిన వారెవరో నాకు తెలియ చెయ్యగలరా?"

వృద్ధుడు యువకుని వంక సూటిగా చూశాడు.

"అదైనా కొంత నా మనస్సుకు ఉపశాంతి కలిగించగలదు" అన్నాడు ఫ్రాంజ్.

వృద్ధుడు సమ్మతి సూచించాడు. వాలంటైన్ నిఘంటువు తెచ్చి ప్రథమాక్షరాలు చూపి తరవాత పుటలుతిప్పి పంక్తులు చూపగా "నేనే" అనే మాట వద్ద వృద్ధుడు దృష్టి నిలిపాడు.

"మీరా?" అన్నాడు ఫ్రాంజ్. అతనికి తలపైన పిడుగు పడినట్లయింది.

"అవును" అన్నాయి వృద్ధుని నేత్రాలు సగర్వంగా.

విల్‌ఫర్ట్ నిలవలేక గదిలో నుంచి పారి పోయాడు.

ఫ్రాంజ్ కుర్చీలో కూలబడ్డాడు. వాలంటైన్ గబగబా వెళ్ళిపోయింది.

★

# వండ్లగింజలో బియ్యపుగింజ

(8-వ పేజీ తరువాయి)

"బలే అర్థంతీశాడిరండి. జరిగినవిషయం అదా? యిందాకటినుంచి చెప్పరేం? మీరు రేపు పుదయాన వెళ్లుతానని ఆయనతో చెప్పారా, లేదా? ఏమన్నా అర్జంటుపనో మరేమిటో అని" వ్యాను నిపంపించి సగౌరవంగా సాగనంపటానికి చేసిన యేర్పాటండి. ఎంత కర్ర్టకు డైనా మామగారు అల్లుణ్ణి రెండ్రోగ్రోజు పెళ్ళి పొమ్మంటాడుటండీ. అసలు మీకెట్లా తోచిందండి ఆ వూహ? అంటూ మెత్తమెత్తగా చివాట్లు పెట్టాడు ఒకాయన.

'మీరూ అంతే అంటున్నారు, మా వాళ్ళు అట్లాగే అన్నారు లెండి నేనేమొ అట్లా అనుకున్నా,' అంటూ చప్పరించాడు గోపాలరావు.

'మీ పోట్లాటకు యిదే కారణం అయితే సర్దుకోవచ్చు. ఇంకా యేమైనా వుంటే మేం చెప్పలేం కానీండి,' అన్నాడు యింకో పెద్దమనిషి యింకా యేమైనా వున్నా యేమో కనుక్కుందామని.

'పెళ్ళికి పిలవకపోయినా, అన్నారు యిందాక. పిలుపులోకూడ తగాదా వచ్చిందా ఏమన్నా' అన్నాడు యింకో ఆయన యింకా చాలా స్టేషన్లు దాటాలి గాబట్టి.

'అదేం లేదులెండి. నా బావమరిది పెళ్ళికి నన్ను పిలవలేదు. పోన్లెండి పిలవకపోతే నాకేం లోపంవచ్చింది. వాళ్ళు వాళ్ళు ముఖ్యులు,' అని ముభావంగా వూరుకున్నాడు గోపాలరావు.

'ఇంకా వాళ్లెవరు? అని ఓ ప్రశ్న వేశారు.

'మా అమ్మ, నాన్నని పిలవటానికి మా వూరు వచ్చాడుగా,' అన్నాడు గోపాలరావు దాయలేక.

'బలే బాగావుంది, మీ అమ్మ నాన్నని పెళ్ళికి పిలిచినవాడు మిమ్మల్ని పిలవడటండీ. మిమ్మల్ని పట్టి వాళ్లా వాళ్లని పట్టి మీరా? ఆమాత్రం గ్రహింపులేదండీ? ఆ హడావడిలో మిమ్మల్ని పిలిచాననుకున్నాడో లేక మిమ్మల్ని పిలిస్తే మీరు పరాయిలో వున్నారో,' అని సమర్థించాడు యింకో కాయన.

'ఆ విషయంమాత్రం కాదులెండి. బహుశా పిలిచాననుకున్నాడేమొ' అంటూ సర్దుకున్నాడు గోపాలరావు.

'నేనింకా యేమిటో యేమిటో అనుకున్నా. మంచి కాలక్షేపమే అయింది యివ్వాళ బండీలో. మా స్టేషను వస్తోంది యిక సర్దుకోవాలి' అంటూ ఒకాయన లేచి నుంచున్నాడు.

'మా మామగారు వూరికే అట్లా అవుతే నేనూ యీ స్టేషన్లోనే దిగుతాను,' అన్నాడు గోపాలరావు.

వాళ్లందరి పకపక నవ్వులు యింజను కూతలో కలిసిపోయినాయి. ★

## స్వీకారము

వదరుబోతు :—విజయదశమినాడు వెలువడిన ఈ వారపత్రిక మొదటి సంచిక మా కార్యాలయానికి చేరినది. సంపాదకుడు కె. దశరథరామయ్య; కార్యాలయం శ్రీనివాస అగ్రహారం, నెల్లూరు; ఆరు పేజీలు, వెల 0-2-0

# కాశ్మీర్ డా॥ గ్రాహం నివేదిక

(5-వ పేజీ తరువాయి)

యుద్ధనినాదాలనూ అరికట్టాలని కూడా భద్రతామండలి ఉభయప్రభుత్వాలకూ ఆజ్ఞఇవ్వాలని సూచించాడు.

సమాధానం కుదరకపోవడానికి కాశ్మీర్ రాజ్యాంగపరిషత్సమావేశ మొక ముఖ్య కారణమని డా॥ గ్రాహం అన్నాడు. కాని పండిట్ నెహ్రూ ఈ రాజ్యాంగ పరిషత్సభకూ ప్లెబిసైట్‌కూ సంబంధం లేదనీ, ప్లెబిసైట్ నిర్ణయాలకు రాజ్యాంగ పరిషత్సభ నిర్ణయాలు ఆటంకం కాబోవనీ స్పష్టపరిచి ఉన్నారు. అయినప్పటికీ పదేపదే ఈ ఆరోపణ చేవడంవల్ల సమాధానం కుదరడానికి ఆటంక మేర్పడుతుందే కాని సహాయపడదని భద్రతామండలి గ్రహించడంలేదు.

ఎంతమంది మధ్యవర్తులువచ్చి ఎట్టి సూచనలు చేసినప్పటికీ భారతప్రభుత్వం తమ అభిప్రాయాన్ని స్పష్టంగా ఇదివరకే తెలియపరిచింది. సైనికోపసంహరణ విషయంలో పరిష్కృత్వాన్ని అంగీకరించడం కల్ల, ఇటువంటి సమస్య సామరస్యం వల్లనే పరిష్కరింపబడాలి. అలా కాని పక్షంలో తిరిగి అశాంతి తప్పదు. 'అజాద్ కాశ్మీర్' సైనికదళాలను నిరాయుధం చేసి దాడి ముప్పును పూర్తిగా తొలగించేవరకూ కాశ్మీర్ నుంచి భారత సైన్యాలను తరలించడం అసంభవం.

కాశ్మీర్‌లో ప్లెబిసైట్ శాంతియుతంగా, స్వేచ్ఛగా, న్యాయంగా జరగాలంటే ఈషరతులు నెరవేరక తప్పదు. ఈషరతులకు లోబడి భారత ప్రభుత్వం భద్రతామండలి తీర్మానాలను చిత్తశుద్ధితో పాటిస్తున్నది. ★



సతదవతీనగర్ లో (ఢిల్లీ) కాంగ్రెస్ సమావేశాలకోసం వేసిన, పెండాల్ బుధవారంనాడు దగ్ధమైపోయింది.

Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, 7, Thambu Chetty St., Madras.



శరన్నవ రాత్రులలో పిఠాపురంలో జరిగిన సాహిత్య సభల సందర్భాన తీసిన ఛాయా చిత్రం. మధ్య వరుసలో మధ్యను కూర్చున్నవారు శ్రీ ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రిగారు. ఈ ఉత్సవంలో శ్రీ శాస్త్రిగారి "ప్రతిమా" కృతిసమర్పణకూడా జరిగింది. కృతిపొందినది శ్రీ సూర్యారాయ విద్యానంద గ్రంథాలయం.

